


శ్రీ విఠల్ ప్రొడక్షన్స్ వారి

# అగ్గిబరాటా

రచన:
G.కృష్ణమూర్తి B.A.
సంగీతం
విజయా కృష్ణమూర్తి
కెమేరా:
వరదరాజ్
కో-డైరెక్టర్:
KVR.ఆచార్య
కో-ప్రొడ్యూసర్
B.V.శ్రీనివాస్
నిర్మాత-దర్శకుడు:
B.విఠలాచార్య
పూర్ణా రిలీజ్

NAVRANG

# ఉత్తరాలు

## వ్యాసాలు

10—9—65 ది ప్రచురింపబడిన వైజ్ఞానిక గాథావళి—3కి డాక్టరుగారి వ్యాసంపై మా ఇద్దరిమధ్య వాదోప వాదాలు జరిగాయి. తే 25—3—66 ది పత్రికలో శ్రీ పరివల్లి భాస్కర రావుగారు దీనిపై తిరిగి వ్రాయకుండా ఉంటే అది అక్కడితో సమసిపోయేది. ఆయన వ్రాసినట్లు పాఠకులకు దీనిపై అనాసక్తి కల్గింది. జెనిటిక్సు తెలిసిన వారికితప్ప మిగిలినవారికి ఇది ఏమంత ఆసక్తి జనితంగా ఉండదు

మొట్టమొదటిసారిగా నేను ఆయన వ్యాసంపై విమర్శ రాసినప్పుడు దానిని ప్రచురణకోసము మాత్రమేకాదని, దానిని రచయిత "డాక్టర్" గారికి పంపించాలని, ఆయినా నిర్ణయాన్ని పత్రికాధిపతులకే వదలి వేస్తున్నానని రాశాను. అయితే నేను డాక్టర్‌గారికి రాసినది ప్రచురింపబడలేదు. డాక్టర్ గారి జవాబు వచ్చింది. దానిపై నేను తిరిగి రాశాను. ఆయన తిరిగి జవాబిచ్చారు. ఆజవాబు ధోరణి,తీరుని గురించి నేను వేరుగా రాయనక్కరలేదు. విషయం సంగతి ఎటువుంచి ధోరణిబట్టయినా జవాబుయివ్వకుండా ఉంటే సభ్యతగా ఉంటుందని నా వివేకమందికి అని పించింది

శాస్త్రీయ వ్యాసాలు రాస్తున్నప్పుడు కొన్ని పొర పాట్లుగాని, విషయం చెప్పడంలో కొంచెం అటూ ఇటూ సందిగ్ధంగాని కావచ్చును దానిని గురించి రాసిన తరువాత కొసతాపాలకు ఆస్కారంలేదు. ఒక్క ఉదాహరణ ఇస్తాను. నేను ఈ పత్రికలో ఒక వ్యాసం రాసినప్పుడు నా సబ్జక్టుకు సంబంధించని విషయాన్ని ప్రస్తావించవలసి వచ్చింది. అందువల్ల ఆ విషయానికి సంబంధించిన కొంతమందిని సంప్రతించి అధునాతన పుస్తకాలు కూడా చూసి ఒక వ్యాసాన్ని వ్రాశాను. ఆదే సబ్జక్టుకు సంబంధించిన ఒక ప్రముఖ డాక్టరుగారు (వైజ్ఞానిక గాథావళి రచయితలుకారు) దానిమీద సందేహం వెలిబుచ్చారు. నేను వాదోప వాదాలకు దిగక వేరుగా ఆయనకే వ్రాసి నేను వ్రాసిన దానిలో తప్పులేదనిపించుకున్నాను. దీనిలో ఎవరికి ఏమి నష్టములేదు.

శ్రీ పరివల్లి భాస్కరరావుగారు కూడా వారి ఉత్తరంలో మెండెలు మొదటిసూత్రము డాక్టరుగారి వ్యాసంలో "ఖూనీ" అయిపోయింది అన్నారు. ఆయన ఉద్దేశ్యం మొదటి సూత్రం, "ప్రబలత్వం,దుర్బలత్వం" కు సంబంధించినది అని అనుకొంటాను. నిజానికి అది మెండెలు "సూత్రాల జాబితాలో"కి రాదు. మెండెలు మొదటి సూత్రం గమిట్ల శుద్ధత్వముదీనినిగురించిగాని, రెండవసూత్రమైన గామిట్ల స్వతంత్రతకలయికగురించికాని డాక్టర్‌గారు వివరించనే లేదు. అవి సామాన్య పాఠకులకు అర్థం కావని ఆయన అభిప్రాయం. రెండవ సూత్రమని భాస్కర రావుగారు వ్రాసినది నిజానికి మొదటిసూత్రం దానిలోనే 3:1,1:2:1, 2:4:2 విషయం ప్రస్తావనకు వచ్చింది. శ్రీ భాస్కరరావుగారన్నట్లు, పెద్దైనా ఒక చిన్నదాన్ని ఉదాహరణకు తీసికొని పైకుబడే 3:1 నిష్పత్తిని, లోపలుండే 1:2:1 నిష్పత్తిని వివరించి ఉంటే సులభగ్రాహ్యంగా ఉండడమే కాకుండా శాస్త్రీయంగా న్యాయం చేకూర్చి నట్లుయుండేది.

మెండెలు ప్రయోగాల వివరణలో ప్రబలగుణము, దుర్బల గుణముల గురించి వివరించకపోయిన, 3:1 నిష్పత్తి గురించి చెప్పకపోయినా మెండలిజముకు ఏ విధమైన న్యాయము జరగదు. 22 రకాల బటాని మొక్కలు అనే విషయానికి ఉండే ప్రాముఖ్యము అత్యల్పము. 7 జతల గుణాలమీద అతని ప్రయోగముయొక్క ప్రాముఖ్యము అనంతము. ఈ సందర్భములోనే 22 రకాల విషయం నేను మర్చిపోయాను. అదితప్ప నేను రాసిన ఇతర విషయాలలో నా అభిప్రాయము అంతే. మనసారాగా నా వాదాన్ని అంగీకరిస్తూనే జెనిటిక్సుశాస్త్రంలో అనుభవం ఉన్న శ్రీ భాస్కరరావుగారు వ్రాశారు. ఆయనకు నా కృతజ్ఞత.

నేను 20 సంవత్సరాల అనుభవం కలిగివున్నానని డాక్టరుగారే అనుకోంగా మొదట్లో తొందరలో నో కోపంలోనో ఉపయోగించారు. నాఅనుభవం ఈమార్గంలో 14,15 సంవత్సరాలుమాత్రమే. అలాగేవ్రాసాను అనుకోంగా. జెనిటిక్సు విషయంలో తెలుగులో నేనుకొన్ని వ్యాసాలు వ్రాశాను. ప్రముఖ వైజ్ఞానిక పత్రిక ప్రచురించింది. పేరుపొందిన అకాడమీ నను తెలుగులో సంపూర్ణంగా వివరించి వ్రాసిన పెద్ద జెనిటిక్సు గ్రంథాన్ని ప్రచురిస్తుంది. ఇది నా అభిమాన విషయం, దీనిలో కొంతకృషి ఉండబట్టి డాక్టరుగారి వ్యాసంలోని కొన్ని అభిప్రాయాలు సరిగానివని వ్రాశాను. ఇంత ఇలా వ్రాయడం ఆషామాషీగా ఏదో రాయాలని రాసిందికాదని తెలియబర్చడానికే. అది కూడా ప్రచురణ పొందాలనే ప్రాథమికోద్దేశ్యం నాకు లేనేలేదు. కాని వారు దానిపై రావలసిన దానికన్నా చాలా ఎక్కువగానే కోపం తెచ్చుకున్నారు.

చెవుల పిల్లల్లో సంపూర్ణ ప్రబలత్వం వటం చూపడం అశాస్త్రీయం అని, 3:1 నిష్పత్తి బదులు, 1:2.1 గా చెప్పినా దానినే 2:4:2 అని చెప్పడం సరికాదని వ్రాశాను. "రెండూరెండూ నాలుగు కాక మరేమిటి? అని అడుగుతారేమో.....
......ఈసత్యాన్ని గుర్తించడానికి ముప్పయి ఏళ్లు పట్టింది" అని వ్రాయడం మెండెలుపై వ్యాసానికి ఉపోద్ఘాతం సమంజసమా, శాస్త్రీయంగా న్యాయమా అన్నది నాకు సందేహమే. మెండెలు గొప్పతనం ఎంతో పెద్దదిగా ఉన్న అంకెలను కుదించి చిన్న నిష్పత్తిలో చెప్పగలగడం. ఉదాహరణకు 315:101 నిష్పత్తిలో వచ్చినదానిని 3:1 నిష్పత్తి లేక 1:2:1 అని గ్రహించాడు. దీనిని తిరిగి సంసం హెచ్చించి 2:4:2 అనడం అనవసరం. దానివల్ల ఎంతసామాన్యులకైనా 1:2:1 అని చెప్పేదాని కన్నా ఎక్కువగా అర్థంకాదు.

మొత్తం మీద శ్రీ పరివల్లి భాస్కరరావు గారు ఉత్తరంవ్రాసి పాఠకులకు ఈవిషయంలో మరికొంత తెలిపినందుకు నాకు సంతోషంగా ఉంది.

జమ్మి కోనేటిరావు (కడప)

## విభక్తులమీద భక్తి

కొద్దివారాలకిందట ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నేను వ్రాసిన "వింత తెలుగు"లో తెలుగులో విభక్తులు ఎనిమిది ఎందుకు అన్న సమస్యను ఎత్తుకుని స్థూలీ పులాకన్యాయంగా ఒకటి రెండు ఉదాహరణలుమాత్రం ఇచ్చాను. ఆ విషయంమీద నేను వ్రాసిన సంగతులు అవసరమైనంత విపులంగా లేక కొంతవరకూ అపార్థాలకు దారితీసినట్లు తెలిసి మళ్లీ వ్రాస్తున్నాను. ఈసారి అయినా నా హృదయగతాభిప్రాయాన్ని సరిగ్గా విప్పిచెప్పడంలో కృతకృత్యుణ్ణ నవుతానని ఆశిస్తున్నాను.

సంస్కృత విభక్తి ప్రత్యయాలను తెలుగులోకి మక్కికి మక్కి దించేరన్న నా వాదానికి ఒకటి రెండు ఉదాహరణలు ఇస్తాను. సంస్కృతంలో "రామాత్"అనే శబ్దం తీసుకుందాం. దీనికి రాముని వలన, రామునికంటె, రామునివల్ల అనే మూడు అర్థాలూ వస్తాయి. సందర్భాన్నిబట్టి అర్థం చెప్పు కోవాలి. కనుక ఈ అర్థం ఇచ్చే ప్రత్యయాలను ఒక విభక్తి కిందికి చేర్చి, పంచమీవిభక్తి అన్నారు. తెలుగులో ఆవిధంగా లేదు కదా?

షష్ఠీ విభక్తి తీసుకుందాం. అందులో "కి కు, యొక్క, లో, లోపల"అనే ప్రత్యయాలున్నాయి. ఇవి అన్నీ అర్థంలో ఒకదాని కొకటి సంబంధం ఉన్న ప్రత్యయాలు అంటే ఎవడైనా నమ్మగలడా? "కి, కు" లకు సంబంధం ఉంది సరే. "యొక్క" ఇందులో ఎందుకు? "లో, లోపల అనే ప్రత్యయాలు సప్తమీ విభక్తికి దగ్గరలో లేవూ? అయితే వీటినన్నింటినీ షష్ఠిలో ఎందుకు చేర్చారు? అవని చేసినవాళ్లు తెలివి తక్కువవాళ్లా? కాదు. సంస్కృతంలో ఈవిధంగా ఉంది కనుక. ఆ భాషలో ఆవిధంగా ఉండడమే న్యాయం. ఏమంటే "రామాణాం" మాట తీసుకుందాం. "రాములకు, రాముల యొక్క, రాములలో అనే మూడు అర్థాలూ దీనికి ఉన్నాయి. అందుకని వాటిని ఒకచోట చేర్చారు. తెలుగులో ఇల్లా లేదు కదా?

ద్వితీయావిభక్తి ప్రత్యయాలు "ని,ను,ల, కూర్చి, గురించి" అని చదువుకున్నాం. 'ని, ను, ల' అనేవి ఒకదాని కొకటి సంబంధంఉన్న ప్రత్యయాలు. సరే, మరి "కూర్చి, గురించి" మాట ఏమిటి? ప్రసాదానికి ప్రసాదం, పీఠ్లకి పీఠ్లగా లేవూ? సంస్కృతంలో "రమమ్" అనేమాటకి పైన చెప్పిన అర్థాలు అన్నీ వస్తాయి. తెలుగులో అల్లాలేదు కదా?

సంస్కృతాంధ్రాలను అలా ఉంచి, పరిణతి చెందిన వ్యాకరణంగల మరో భాషను తీసుకుందాం. ఉదాహరణకు రష్యన్ భాష. ఆ భాషే ఎందుకు అంటారా, రష్యన్ భాషను గురించి నాకు కొద్దిగా తెలును కనుక. ఉదాహరణలు ఇవ్వడానికి ఏ భాష అయినా ఒకటే కనుక.

రష్యను వ్యాకరణంలో "కొరకు, యొక్క" అను ఒక విభక్తిలో చేర్చారు. ఆ భాషలో ఈ రెండు అర్థాలలోనూ పదాంతములు ఒక్కలాగే ఉంటాయి కనుక అది సబబే. అదే సంస్కృతంలో అయితే "కొరకు' చతుర్థి అయింది. "యొక్క" షష్ఠి

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 3—6—'66

పరాభవనామ సం॥ జ్యేష్ఠమాసం శు॥ పౌర్ణమి

సంపుటము: 58 సంచిక: 40

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్రవారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |


ఆలోచించే
యంత్రాలు

?

ఎలా ఆలోచిస్తాయో?
వచ్చేవారం చదవండి!

# మనలో మాట

ఈవారం మొదలు పెడుతున్న 'ఆమ్రపాలి' నవల రచయిత సీతారామంగారి జీవిత చరిత్ర, బొమ్మ ఈక్రింద చూడవచ్చు. మూలం రాసిన శ్రీ రామచంద్ర ఠాకూర్‌ని గురించి శ్రీ సీతారామంగారు రాసిపంపినదికూడా ఈ క్రింద ప్రచురిస్తున్నాము.

* * *

"శ్రీ రామచంద్ర ఠాకూర్ ఎం. ఏ. గారిని గురించి శ్రీ దావూలాల్‌గారి హిందీ 'ఆమ్రపాలి, వ్యక్తవ్యం లోనూ, శ్రీ రామచంద్ర ఠాకూర్‌గారి భూమికలో ఉన్న కొన్ని విషయాలు క్రింద పొందుపరుస్తున్నాను.

శ్రీ రామచంద్రఠాకూర్ ఎం. ఏ. గారు ప్రసిద్ధ గుజరాతీ సాహిత్యకారులు. పాలీ, సంస్కృతం, హిందీ, ఆంగ్లం—ఈ భాషలలో పండితులు. ఫిలిం నిర్దేశకులు కూడాను. కళాశాలలో పాలీ భాష ప్రత్యేక విషయంగా తీసుకున్నారు. 1932 సంవత్సరప్రాంతంలో, కాలేజీలో చదువుచున్న రోజులలో ఆర్థిక మగు కష్టములు కలుగుటచే ఆయన సినిమాకొరకు కథ వ్రాయ నిశ్చయించి 'ఆమ్రపాలి' కథను సినిమాక అనుకూలముగు విధముగా 'పటకథ' రూపంలో సిద్ధం చేశారు. మిత్రుల సలహాపై ఈ 'పటకథ'ను నవలగా రూపొందించారు. పాలీ సాహిత్యాన్ని గుజరాతీ పాఠకులముందు ఉంచాలన్నది వారినిశ్చయం. ఈ 'ఆమ్రపాలి' నవల ద్వారా ఆ నిశ్చయం నెరవేరింది వారు పులకిత హృదయులయ్యారు క్రీ. శ 6—7 శతాబ్దాలకు పూర్వమందున్న సంఘాన్ని, మనుష్యులనూ చూపడం 'ఆమ్రపాలి' వ్రాయడం యొక్క ముఖ్యోద్దేశము దీనికి పాలీ భాషా గ్రంథాల సహాయం కూడా తీసుకున్నారు."

* * *

శ్రీ ఆకెళ్ల సీతారామంగారు 1913 లో పిఠాపురంలో జన్మించారు. ఎం. ఏ. హిందీ, సాహిత్య విశారద పట్టభద్రులు. 1941 నుండి రాజమండ్రి ప్రభుత్వోన్నత పాఠశాలలో, 1951 నుండి మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో, రాజమండ్రి, అనంతపురం



శ్రీ ఆకెళ్ల సీతారామం

కళాశాలలలో అధ్యాపకులుగా, ప్రస్తుతం అనంతపురంలో పని చేస్తూవున్నారు. ఎన్నో వ్యాసాలు, కథలు, నవలలు హిందీనుంచి తెలుగులోకి అనువాదంచేశారు. పింగళి సూరన 'కళాపూర్ణోదయా'న్ని హిందీలోకి, గద్యంగా, మార్చారు. తెలుగులో సాహిత్యానికి సంబంధించిన వ్యాసాలు చాలా రాశారు.

* * *

1966 గోపాలకృష్ణగోఖలే శత జయంతి ఉత్సవ సంవత్సరం. ఈ సందర్భంలో సుప్రసిద్ధ మహారాష్ట్ర రచయిత శ్రీ వి. ఎస్. మర్చంకర్ గోఖలే మీద రాసిన చిన్న వ్యాసం ఒకటి ఈ సంచికలో వేస్తున్నాము.......

ఇదే సంచికలో శాసన సభలలో మంచిపేరు తెచ్చుకున్న శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి వ్యాసం ఒకటి ప్రచురిస్తున్నాము......

# విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి గీతాంజలి.




కాంగ్రెస్ పార్టీలో విద్రోహశక్తులకు
ఇందిరాగాంధి హెచ్చరిక!






కామరాజ్‌కు తలనొప్పి!









పాక్ సైనికులకు చైనా శిక్షణ—వార్త

# ప్రత్యేక లిపి కోసం ప్రత్యేక రాష్ట్రం!

రాజధానిలో శ్రీ అశోక్ మెహతా వాషింగ్టన్ యాత్ర, పంజాబీ సుబాలని గురించి మాట్లాడుకుంటున్నారు.

శ్రీఅశోక్‌మెహతా అమెరికా ఎంతసహాయం ఇచ్చేదీ ఇంకా జనసామాన్యానికి చెప్పలేదు. సహాయం మొదటి సంవత్సరం ఎంతో, అసలు సహాయం ప్రాజక్టులకి మాత్రమే పరిమితి అవుతుందో అవదో ఆయన మనకి తెలియచెయ్యాలి.

ఇదికాక శ్రీ మెహతా ప్రణాళిక పరిమాణా లని గురించి మాట్లాడుతున్నారు. విదేశ సహాయం మాట అలా ఉంచి దేశంలో రూపాయల బలమే తగ్గినప్పుడు ఈ ప్రకట నలని ఎలా అర్థం చేసుకోవాలి ?

అసలు యీ ప్రణాళిక 'నిర్మాతలు ఎప్పుడూ ఆకాశంలో విహరిస్తూ ఉంటారు. నిజానిజాలతో వారికి సంబంధం తక్కువ. నేడు మన దేశం ఆర్థికంగా పెద్ద సమస్య లని ఎదుర్కొంటోంది. అనావృష్టి, చైనా పాకిస్తాన్‌లు వీటికి చాలావరకు కారణాలు. కాని ప్రణాళిక నిర్మాతల బాధ్యత కూడ చాలాఉంది. మును పు గుల్జారీలాల్ నంద గారు, నేడు అశోక్ మెహతాగారు, అంతే లేదా. ఎంత పెద్ద ప్రణాళిక వూహించ గలం, ఎంత ఖర్చు అవుతోంది— ఈ రెండు విషయాలని గురించి మాత్రమే వారు ఆలోచిస్తారు. రెండవ అంశానికి సృష్టికర్త కీ. శే. మౌలానా ఆజాద్. శ్రీ నెహ్రూ, ప్రణాళిక కాంగ్రెసుపార్టీ 'మానిఫెస్టో' అన్నారు. కాంగ్రెసుకు వోటు వేస్తే నిరుద్యోగ సమస్యని పరిష్కరించినట్లే అన్నారు ఆయన. అయిదు సంవత్సరా రాల క్రితం ఈ విధానం పనిచేసింది కాని. నేటి క్షామ పరిస్థితులలో, ఆర్థిక ఇబ్బందులలో వోట్లు అంతగా పడవేమో. అయినా ఇది శ్రీ కామరాజు, శ్రీమతి గాంధీలు పరిష్కరించవలసిన సమస్య, శ్రీ మెహతాకి దీనితో సంబంధం లేదు. కాంగ్రెసు పార్టీ లోనే అయుతే పెరాయి నాడినీ తెలుస్తుంది. ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను.

స్టీలుకి సంబంధించిన పరిశ్రమలో 'వేస్టు'కి చాలా ప్రాముఖ్యత ఉంది. ఈ ఏడు 2 లక్షల టన్నుల వేస్టు మిగిలి పోయింది. పై ఏడు 4 లక్షలు మిగిలి పోతుంది. దీనిని ఎగుమతి చెయ్యాలి, లేదా తగలబెట్టాలి.

ఇంత వేస్టు ఎందుకు మిగలాలి ? ప్రణాళిక వివరాలు సరిగ్గా లేవు కాబట్టే. గుజరాత్‌లోని 'స్టీలు రిఫైనరీ పరిశ్రమ' సంస్థకి సంబంధించిన పనులు సరిగ్గా జరగలేదు. రష్యాతో 'కోయాలి' రిఫైనరీకి బేరాలు జరిపి నప్పుడే ఈ విషయమూ తెల్సుకుని ఉండాలి. మద్రాసులో ఎరువుల ఫ్యాక్టరీ, రిఫైనరీ బేరం కలిపి చేశారు. దీనికి కారకులు శ్రీ పి. ఆర్. నాయక్. ఆయన దూర దృష్టితో అన్ని [illegible] చేశారు. ఆయన ప్రస్తుతం ఈ శాఖలో లేరు. అందు కనే పరిస్థితి కొంచెం మారింది.

* * *

మాస్టర్ తారాసింగ్ సిక్కులు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకోవాలి అంటు న్నారు. ఆయన అనుచరులు ఒక సరికొత్త సూచన చేశారు. హిందువు—సిక్కు అనుబంధం పెంపొందడానికి ప్రతి హిందువు కుటుంబంలోనూ ఒక సిక్కు, [illegible] ఉండాలన్నారు. అంటే ప్రతి సిక్కు కుటుంబం తమలోనూ ఒక్క హిందువు వ్యక్తి [illegible] ఉంటాలా ? ఇది [illegible] గలం [illegible] ? "[illegible] అంటే [illegible], [illegible] అంటే నే [illegible]" [illegible] ఉంది పై సూచన.

ఒకప్పుడు సర్ మహమ్మద్ ఇక్బాల్



ఒరిస్సాలోని అనావృష్టి బాధిత ప్రాంతాలలోని బాలలకు శ్రీమతి ఇందిరాగాంధీ ఆహారం, పాలు పంచిపెట్టిన దృశ్యం.

# న్యూ ఢిల్లీ లేఖ

ఖాన్, ప్రతి హిందువూ ఒక మహమ్మదీయ నామం పెట్టుకుంటే హైందవ—మహమ్మదీయ అయికమత్యం కుదురుతుందన్నారు.

ఇండొనేషియాలో చాలామంది ముస్లింలకి హైందవ నామధేయాలు ఉన్నాయి. కాని, ఇదెంతవరకూ సహాయపడింది ?

పార్లమెంటులో మాట్లాడుతూ, చట్టశాఖ మంత్రి 'మహమ్మదీయులలో బహుభార్యాత్వం నిషేధించే చట్టం తీసుకరావటం వీలుపడదు' అన్నారు. అంటే ఈ మతంవారికి కుటుంబనియంత్రణ పద్ధతులు అసలే వర్తించవా ?

1941 లో మహాత్మాగాంధి జనాభా లెక్కలని లెక్కచెయ్యరాదన్నారు. ఆయన ఆదేశాన్ని ముస్లింలు పాటించలేదు. అందుకనే, హైందవుల మొత్తాలు తక్కువగా కనబడి, వారు అధికంగా ఉన్న ప్రాంతాలు కూడా కొన్ని పాకిస్తాన్‌కి వెళ్లిపోయాయి.

నేడు అదే పని జరుగుతోంది. హైందవులలో చాలామంది 'లూప్', మాత్రల సహాయంతో పిల్లలు పుట్టకుండా జాగ్రత్తపడుతున్నారు. మహమ్మదీయుల సంఖ్య పెరుగుతోంది. ఇంకొక పాకిస్తాన్ ఏర్పడే ప్రమాదం ఉందా ?

ఈ సంగతిని గురించి నేను కొందరు అమెరికన్లతో మాట్లాడాను. అమెరికాలో రోమన్ కాథలిక్కులు కూడా కుటుంబ నియంత్రణ పద్ధతులని గర్హిస్తున్నారు కదా అని వారు వాదించారు. కాని, అమెరికన్ కాథలిక్కులు తమకి వేరే దేశం కావాలని అడుగుతున్నారా? కోరుతున్నారా ? ఆయిర్లాండ్‌లో కూడా వేరే రాజ్యం కావాలని కోరింది, ప్రొటెస్టెంట్లు మాత్రమే.

నేను ఇంతకి ముందు ఒకసారి అన్నాను, సిక్కు సమస్యకి కారకులు మహాత్మాగాంధి అని. వారిలో కొందరి కోసం ఏవేవో ఏర్పాట్లని అంగీకరించి నేడు సిక్కు రాష్ట్రం ఏర్పడే పరిస్థితికి పునాదులు వేశారు. పంజాబులో సిక్కులూ, హైందవులూ కూడా పంజాబీ భాష మాట్లాడుతారు. కాని సిక్కులు గురుముఖీ లిపి కావాలనీ, హైందవులు దేవనాగరి లిపి కావాలనీ పోట్లాడుతున్నారు. అంటే, పంజాబు రాష్ట్రాన్ని లిపి కోసం రెండు ముక్కలు చేస్తున్నారన్నమాట.

ఈ లిపి విషయములో హైందవులకీ మహమ్మదీయులకీ కొంతకాలంగా వాదవివాదాలు జరుగుతూనే ఉన్నాయి. దేవనాగరీ, పర్షియన్ లిపులకోసం ఒకరితో ఒకరు పోట్లాడుకుంటున్నారు.

మాస్టర్ తారాసింగ్ సిక్కిస్తాన్ కావాలని మొదటినుంచీ అంటూనే ఉన్నారు. నేడు సిక్కులకి తమ వ్యవహారాలని తామే చూసుకునే హక్కు కావాలంటున్నారు, నాగాలు, మిజోలు కొందరు కోరినట్లే.

ఈయన శ్రీ మహమ్మద్ అలీ జిన్నా అనుచరులలో ఒకరుగా ఉండేవారు. ఇప్పుడూ అదే వాలకం చూపిస్తున్నారు. నిజంగా ఆయన భక్తుడే అయితే భారతదేశం నాలుగుమూలలా ఉన్న సిక్కు లందరినీ ఉపసంహరించుకొనటానికి సంసిద్ధుడు కావాలి.

సిక్కులకి ప్రత్యేకంగా సృష్టించే సిక్కిస్తాన్ ఆర్థికంగా న్యూఢిల్లీ నుంచి స్వతంత్రంగా ఉండగలదా ?

సిక్కిస్తాన్ వస్తే అది భారతదేశపు ఎల్లలమీద ఉంటుంది. దాని పక్కనే మనల్ని ద్వేషించే దేశం ఒకటి ఉంటుంది. చరిత్రలో భారతదేశం మీదకి దండెత్తి వచ్చినవా రందరూ పంజాబుల ద్వారానే వచ్చారు.




హమామ్ వల్ల తాజాగాను కాంతిగాను వుండండి







హమామ్‌తో రుద్దుకొని ప్రతి దినము స్నానము చెయ్యండి. హమామ్ మీ శరీరమును శుభ్రపరచుటయే గాక, దానికి కాంతినిచ్చి, హాయిని గొల్పును. ప్రతిరోజూ హమామ్ వాడండి...ఈ సబ్బు మాత్రమే వాడకానికి చాలా రోజులువస్తుంది.

టాటా ఉత్పత్తి

CMTH-3 Tel



గోపాలకృష్ణ గోఖలే

# 1866-1966!

గోపాలకృష్ణ గోఖలే తండ్రిది అసలు రత్నగిరి జిల్లా సముద్రతీరం మీద నున్న కోల్బాక్ అనే ఊరు. అక్కడ జీవనోపాధి కుదరక ఆయన కొల్హాపూరు రాజ్యంలోని కాగల్‌కి మారిపోయి, అక్కడ పోలీస్ శాఖలో ఒక చిన్న ఉద్యోగం సంపాదించుకున్నాడు. క్రమంగా సబ్‌ఇన్‌స్పెక్టర్ హోదాకు చేరుకున్నాడు. కాని, అకాలంగా మరణించటంతో ఆయన కొడుకులు గోవింద్, గోపాల్‌ల చదువుకి అంతరాయం కలిగింది. ఇద్దరూ మంచి తెలివి గల పిల్లలే అయినా పెద్దవాడు గోవింద్ తమ్ముడి కోసం చదువు మానుకుని ఉద్యోగంలో చేరాడు. అంతేకాక తనకి వచ్చే రు. 15/— జీతంలో సగందాకా గోపాల్ చదువు మీదనే ఖర్చు చేసేవాడు. అప్పటికి గోవింద్‌కి పెళ్ళి అయింది. అందు వల్ల ఈ ఖర్చు చాలా కష్టంగా ఉండేది. చివరికి గోపాల్ మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తి కాగానే పై చదువు చెప్పించే స్తోమత లేదని చెప్పవలసి వచ్చింది గోవింద్‌కి.

గోపాల్ ఈ నిర్ణయాన్ని స్వీకరించినా అతని వదినగారు మాత్రం అతని విద్యాభ్యాసానికి అంతరాయం రారాదని తన నగలని అమ్మినా సరే చదువు సాగాలని భర్తకి నచ్చచెప్పింది. తన ఈ త్యాగం భారత దేశానికే ఎంత మేలు చేకూర్చిందో ఆమెకి అప్పటికి తెలియదు. గోపాల్ కొల్హాపూర్‌లోని రాజారామ్ కాలేజీలో చేరి, రెండేళ్ళ తర్వాత, తన పద్దెనిమిదవ ఏట పట్టభద్రుడయ్యాడు. విద్యాదానం కన్న గొప్ప దానం లేదనుకుని తిలక్ మొదలయిన వారు స్థాపించిన 'డక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీ' లో చేరి మహారాష్ట్రలో విద్యావ్యాప్తి కోసం కృషి ప్రారంభించారు.

గోపాలకృష్ణ గోఖలే మొదట 'ది న్యూ ఇంగ్లీష్ స్కూల్' లో 35 రూపాయల జీతానికీ, తర్వాత ఫెర్గుసన్ కాలేజీలో 75 రూపాయలకీ అధ్యాపకుడుగా పని చేశాడు. రిటయిరయ్యే సరికి ఆయన పింఛన్ రు. 35/— కాలేజీలో అధ్యాపకుడుగా ఉన్నప్పుడే గోఖలేకి, 'కిరీటం ధరించకపోయినా పూనా నగరానికి రాజు' అనబడే 'జస్టిస్' రానడే పరిచయ భాగ్యం కలిగింది. క్రమశిక్షణ, కృషి, త్యాగం వీటినే మతంగా స్వీకరించిన రానడే గోఖలేకి తగిన గురువే అయాడు. 1896 లో గోపాలకృష్ణ గోఖలేని, అతని 30వ ఏట, ఇంగ్లండులోని 'వెల్బియు కమిషన్' ముందు హాజరు కావటానికి పూనా డక్కన్ సభవారు ఎన్నుకున్నారు. భారతదేశం సాంఘిక, ఆర్థిక సమస్యలని పరిశీలించటమే ఈ కమిషన్ ముఖ్యోద్దేశం. గోఖలేతో బాటు శ్రీయుతులు దిన్‌షావాచా, సురేంద్రనాథ్ బెనర్జీ, సుబ్రహ్మణ్య అయ్యర్లు కూడా వచ్చారు కాని ఈ యువకుని మేధాసంపత్తి బ్రిటన్ మేధావుల వర్గాలలో భారతదేశం ఎదుర్కొనే సమస్యలని గురించిన చైతన్యం కలిగించింది. ఆ తర్వాత ఆయన బ్రిటన్‌కి ఎన్నోసార్లు వెళ్ళారు. ఆయన కృషి 'మింటో మార్లే' సంస్కరణాల రూపంలో ఫలించింది.

1899 లో గోఖలే బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్‌కి, 1902 లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కి ఎన్నుకున్నారు. పదమూడు సంవత్సరాలుగా శాసనసభలో గోఖలే దేశంలోని అనధికార వర్గాల ప్రతినిధి అయ్యాడు. ఆయనతో తరచు ఘర్షణ పడే లార్డ్ కర్జన్, "గోఖలేతో యుద్ధం చెయ్యటం తనకెంతో ఆనందాన్నిఇచ్చేద"న్నాడు. లార్డ్ మింటో, లార్డ్ కిచనర్ కూడా గోఖలే పట్ల ఎంతో గౌరవం చూపేవారు. తను వైస్రాయి అయితే గోఖలేని ఆర్థికమంత్రి చేస్తానన్నాడు కిచనర్.

భారతదేశంలోని సంపత్తి అంతా బయటికి పోతోందనీ, సామాన్యపౌరుడి పరిస్థితి బాగా దిగజారి పోతోందని గోఖలే హెచ్చరిస్తూ ఉండేవాడు. తన వాదా లన్నిటినీ సహేతుకంగా నిరూపిస్తూ ఉండేవాడు. కేవలం మాటలతోనేకాక, చేతలతో ఇతరులని ఉత్తేజ పరిచేవాడు. 1905 లో, బెంగాల్ విభజన జరిగిన సంవత్సరంలో, గోఖలేని వారణాసిలో జరిగినకాంగ్రెస్ సభకి అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. అప్పుడు ఆయన వయసు 39 మాత్రమే. అందుకనే, ఆయనని యువ నాయకుడనికూడా అనవచ్చు.

మహాత్మాగాంధి గోఖలే తన రాజకీయ గురువు అన్నారు. 1896 లో వారిద్దరూ మొదటిసారిగా కలిశారు. వెంటనే వారిద్దరిమధ్యా ఒక అనిర్వచనీయమయిన స్నేహం ఏర్పడింది. మహాత్మాగాంధీ గోఖలేని "ప్యూర్ యాజ్ ఎ క్రిస్టల్, జెంటిల్ యాజ్ ఎ లాంబ్, బ్రేవ్ యాజ్ ఎ లయన్ ఎండ్ షివల్రస్ టు ఎ ఫాల్ట్" అని వర్ణించారు.

గోఖలే కృషివల్ల భారతదేశంలోని ప్రజల ఉద్యోగుల పరిస్థితిని గురించి బ్రిటిష్ ప్రభుత్వం ఒక రాయల్ కమిషన్‌ని నిర్మించింది. ఈ కమిషన్‌లో గోఖలేతోబాటు ముగ్గురు భారతీయులని వేశారు. ఈ కమిషన్ పరిశీలనల సందర్భంలో ఆయన చేసిన కృషే గోఖలే ఆరోగ్యాన్ని చెడగొట్టింది. రిపోర్టుమీద సంతకం పెట్టేదాకా ఆయన జీవించలేదు. తను తలపెట్టిన కార్యం సాధించకుండానే వెళ్ళిపోతున్నాననే విచారం ఆయనని మరింత కుంగదీసింది. 'ఇంకొకరెండేళ్ళు జీవించగలిగితే నా మాతృదేశం ఋణం తీర్చుకోగలుగుతా' నన్నాడు గోఖలే.

గోపాలకృష్ణగోఖలే ఫిబ్రవరి 19 న, 1915లో పూనాలో మరణించాడు. అప్పటికి ఆయన వయసు 49.

—వి. యస్. సుక్తాంకర్

మూలం: రామచంద్రఠాకూర్




ఆమ్రపాలి ఆనాడు వైశాలి గణ రాజ్యంలోను, తత్పరిసర గణరాజ్యాల లోను వాసికెక్కిన అపూర్వ సుందరి. ఆమెను ఒక్కమారైనా దర్శించలేక పోయామే అని వాపోనివారు, దర్శించి ఆమె అపాంగ వీక్షణాలకోసం అంగ లార్చనివారు లేరు. కాని, ఆమె పన్నగ రాజ పరివేష్టితమైన నిధి. లిచ్ఛవీ గణరాజ్య విధి నిషేధాలవల్ల ఆమెను వమీపించడానికే ఎవరూ సాహసించే వారు కారు. అలాటి సాహసానికి పూను కున్నవాడు మగధరాజు బింబిసారుడు. మాగధులకు లిచ్ఛవీలకు అహినకుల న్యాయంగావున్న వైరాన్ని, వైశాలీ నగర దుర్గమతను సరకుచేయక సాహసించిన బింబిసారుడు ఆమ్రపాలి అనురాగానికి పాత్రుడై, ఆమెకు మాతృత్వమూ ప్రసాదించాడు.

ఈ చరిత్రాంశం చుట్టూ అల్లిన నవల యిది. కథాగతికోసం రచయిత పలువురిని ఆనుషంగికంగా ప్రవేశ పెట్టారు. ఆ నాటి గణరాజ్యాల రాజ్యాంగ వ్యవస్థ, మగధ సమ్రాట్టుల సామ్రాజ్య విస్తరణ వాంఛ, తండ్రి నైనా తలనరికించే రాజ్యలోభం, పశు వుల సంతలాగ జరిగే బానిసల బేరం, వర్ణాశ్రమ ధర్మాల వైపరీత్యం, వీటి నన్నిటినీ కడిగి వేయడానికి అప్పు డప్పుడు ప్రసరించే తథాగతుని కరు ణాంతరంగిణి ఈ నవలలో పాఠకుని హృదయాన్ని ఆకర్షిస్తాయి.

'చిరంజీవీ, నీ వెందుకు బ్రతుకు తున్నావు?'

'నా భార్య విధవ అవడం నా కిష్టం లేదు కనుక.'

'బ్రతకడానికి నీ కెంతమాత్రం అధికారం లేదు.'

'ఏం చేత?'

'యువకుడవైనా నీలో యువక ప్రాణం లేదు.'

'నిజమే.'

'అవును. నీవు వీరుడవే. కాని వనికిమాలినవాడివి. మనుష్యుడ వైనా రాయివి, పాషాణానివి!'

'వహవ్వా! ఈ చక్కని ప్రశంసకు ధన్య వాదాలు. కాని సుధీరా, నీ దృష్టిలో మను ష్యుణ్ణి అయినా, నాకూ రాతికీ కొంచె మైనా భేదం ఎందుకులేదో దయచేసి చెప్తావా?' అని తల కొంచెం వంచి వినోది చిరంజీవి కోపించిన సుధీరుణ్ణి మరింత కోపిష్టిగా చేయడానికి అడి గాడు.

సుధీరుని రక్తం ఉడికింది. అతనికి క్రిందికి వంగియున్న చిరంజీవి తలను ఖండించాలని కోరిక కలిగింది. కాని, తన పరమమిత్రుణ్ణి చంపిన అపరాధానికి 'ప్రవేణి పుస్తకం' విధించే శిక్ష పొంది, చనిపోయిన తరువాత లభించే నరకాన్ని కూడా అనుభవించడానికి సిద్ధపడాలి. కాబట్టి గత్యంతరంలేక అతడు తన కోపాన్ని అణచుకోవలసి వచ్చింది.

'చిరంజీవీ, నీవు రాయివి కూడా కాదు, మట్టిబెడ్డవు. తెలిసిందా? నిన్ను కొంచెం కూడా నమ్మకూడదు. నీవు నాకు మిత్రుడవు కావు' అని సుధీరుడంటూంటే అతని మాటకు అడ్డువచ్చి చిరంజీవి యిలా అన్నాడు 'సుధీరా, నీవు చెప్తే నేను అతణ్ణి చంపడానికైనా, స్వయంగా చావ డానికైనా సిద్ధంగా ఉన్నాను. కాని, ఒక బాలికను చూడ్డానికి పొరుగూళ్ల వధాయి యింట్లో నీవు ప్రవేశిస్తే, నీకోసం ఎదురుచూస్తూ అవతల తిరుగాడుతూ ఉండడం మాత్రం నావల్లగాదు.'

సుధీరుడు అకస్మాత్తుగా చిరంజీవి దగ్గరికి గెంతి వచ్చి అతని మాటలకు అభ్యంతరంగా 'ఆవిణ్ణి 'బాలిక' అనకు. ఆమ్రపాలి బాలిక కాదు, యువతి. తెలి సిందా?' అన్నాడు.

'అవునవును, యువతే. అందమైన యువతి. అద్భుతం, అప్సరస! కిన్నరి! వూరు విడిచి ఈ వైశాలీ నగరం చేరేవరకూ నీవు వల్లి రినదంతా ఈ యువతిని గురించే. కాని ఆమెకై సంధాగారానికి పోవడం మానేసి, నీకు కావలా కాయడానికి, నిలబడి ఉండ డానికి నేనేం మూర్ఖుణ్ణిగాను. ఆమ్రపాలిని ప్రేమించాలంటే ప్రేమించు. ఆమె యింట్లోనే ఆత్మహత్య చేసికోదలిస్తే అలాగే చేసుకో. నా కెలాంటి అభ్యంతరం లేదు. కాని, నేను లిచ్ఛవీయ వంశీయుణ్ణి; క్షత్రియుణ్ణి. ఆమ్రపాలికోసం నీవు చేసే తపస్సులో నే పడను. సంధాగారంలో నే నుండి తీరాలి. మూడు వేళ లకు ఒకసారి కష్టంమీద ఒకటి రెండు సార్లు మాత్రమే సమావేశమయ్యేదీ, లిచ్ఛవీరాజుల కార్యాన్ని ప్రేరేపించేదీ అయిన సభను విడిచి, ఇక్కడ నీకు ద్వార పాలకుణ్ణి అవుతానా? ఎన్నటికీ కాను.'

ప్రియు డెంత విచిత్రమైనవాడో ప్రేమ అంత విచిత్రమైంది కాదు. కుపితుడైన సుధీరుడు ఒక్కసారిగా దయాళువై 'చిరంజీవీ, ప్రియమిత్రమా, అలా అనకు. నాకు ఎంతోసేపు పట్టదు. నీవు బుద్ధ భగవానుని నామం మూరుసార్లు చెప్పే లోపల నేను వచ్చివేస్తాను.' అని అతనికి నచ్చచెప్పసాగాడు.

'నే నిప్పటికీ శాక్యపుత్రుడైన గౌత మునిధర్మం స్వీకరించలేదు' అని చిరంజీవి గంభీరవదనంతో అన్నాడు.

సుధీరుడికి అర్థంకాలేదు. అతడన్నాడు—'నా మనస్సు కుదుటపడలేదు. కాని, నీకు పరిహాసంగా ఉంది. చిరంజీవీ, భవనంలోకి రాగానే నేను బాణం వేస్తాను. అప్పుడు కార్యం సఫలమైందని నీవు అనుకో. ఇక్కడికే, నీ కాలికిందకే బాణం వస్తుంది. ధనుర్విద్యలో నన్ను నీవు గెలవలేవని నీ వెరుగుదువు. ఒప్పుకో, లేకపోతే, నా శ్రమంతా వృథా అయిపోతుంది..... మనం శీఘ్రంగా సంధాగారం చేరదాము.'

'కాని....'

'చాలించు,' అని సుధీరుడు అతని నోరు మూస్తూ—'ఆమ్రపాలిని నీవు చూడలేదు. అంచేత శ్రద్ధ చూపడంలేదు నువ్వు కాని ఒక్కసారి నీవు ఆమెను చూస్తే'... అన్నాడు.

'చూస్తే ? .... ఆమెను నీ వెప్పుడు చూశావు ? ఐదేండ్ల క్రితం గదా ? అప్పటికి నీ వయస్సు స్త్రీ సౌందర్యాన్ని చూడ్డానికి తగియుండలేదు. నేను నీవెంటే ఉన్నాను. ఆమ్రపాలిని నేను చూడలేదు. నీవూ చూళ్లేదు. మూర్ఖుడా, పాలిని చూడకుండానే ఆమెను ప్రేమించే నీవంటి యువకులు ఎందరున్నారో నీ వెరుగుదువా? నీవు కొత్తసంగతేమీ చెప్పడంలేదు.'

'చిరంజీవీ, నీవు వివాహితుడవు. నాస్థితి నీ కర్థంకాదు.'

'నిజమే. పెండ్లయినవాడు యువకుడు కాదు. కాని నువ్వు మూర్ఖుడవని మాత్రం నాకు స్పష్టమవుతోంది

సుధీరుడు నోరుతెరచి చిరంజీవివైపు చూడసాగాడు. ఒక్క క్షణం ఇద్దరూ మాట్లాడలేదు. చిరంజీవి ముఖంలో అకస్మాత్తుగా కృత్రిమకోపం, పరిహాసం కన్పించాయి. ఆనందంతో అతడు, 'హోయి వెర్రివాడా, ప్రేమించే యువకుడు ఎవడైనా యిలా మాటల్లో కాలహరణం చేస్తాడా? లిచ్ఛవీ కుమారుడవు. పైగా చిరంజీవికి మిత్రుడవై కూడా. పద, ముందుకు, పరుగెత్తు. లేకపోతే వైశాలీ నగరంలోని ఇంకో యువకు డెవడైనా అదృష్టం పండి....'

చిరంజీవి వాక్యం పూర్తికాకుండానే

# ఆమ్రపాలి

సుధీరుడు వైశాలీ మహారాజా మహానామ మని వైభవోపేతమైన ప్రసాదంతో అదృశ్యు డయ్యాడు. చిరంజీవి మందస్మిత వదనంతో లలాటంపై ఉన్న స్వేదబిందువుల్ని తన ఉత్తరీయంతో తుడుచుకో సాగాడు.

సుధీర చిరంజీవు లిద్దరూ యువకులు. యువ్వనోత్సాహం వారి ప్రత్యంగంలోనూ పొంగుతోంది. లిచ్ఛవీయుల పవిత్ర రక్తం వారి నాడుల్లో ఉప్పొంగుతోంది. సమీప గ్రామంనుండి వాళ్లు ఇప్పుడే వైశాలి వచ్చారు. సుమారు నూరు ఏండ్లకు పూర్వం జంబూ ద్వీపమైన భారతదేశములో ప్రతి క్షత్రియ యువకుడూ లిచ్ఛవనామం ఉచ్చరించడం అంటే ఒక ప్రత్యేక గౌరవంగా భావించేవాడు.

అత్యంత పరాక్రమవంతులైన ఆ లిచ్ఛవీయుల వర్ణన అంటే స్వతంత్ర ప్రజల గాథ—స్వాతంత్ర్యాన్ని కూర్చిన గాథ. కాని, దాన్నికూడా మించింది వారి ఐకమత్యాన్ని గురించిన కథ. హిమాలయాల్ని అయినా సులభంగా ఖండించవచ్చునేమో గాని, లిచ్ఛవీయుల్ని ఛేదించడం మాత్రం అశక్యం. లిచ్ఛవీయులు అజేయులు అని ప్రజలు అనుకొనేవారు. నమ్రత, ఐకమత్యం ఉన్నంత కాలం లిచ్ఛవీయుల్ని ఎవరూ జయించలేరని బుద్ధదేవుడు కూడా ఒక సందర్భంలో చెప్పాడు.

'లిచ్ఛవీయులు అంతటి శూరులు, రణవీరులు. జయించడానికి అలవికానివారు. భయం ఎరుగని స్వాతంత్ర్యప్రియులు.'

లిచ్ఛవీయుల రాజ్యమే వేరొక రకమైంది. వాళ్లు క్షత్రియులు అనబడేవారు. ఇతర క్షత్రియ వంశాలతో వారికి సంబంధం ఉండేది. కాని, ఆచార వ్యవహారాల్లో మాత్రం వాళ్లు తమ పూర్వులను అనుకరిస్తుండేవారు. వాళ్లమీద ఏ చక్రవర్తి అధికారమూ లేదు. బానిసతనమంటే ఏమిటో వాళ్లెరుగరు. యుద్ధంలో చనిపోతే జీవితం సార్థకమవుతోందని వాళ్లు అనుకునేవారు. ఎక్కడకు వెడితే అక్కడే జయం పొందేవారు. ఓడినచోట ప్రాణాలు ఒడ్డేవారు. మగధ, కోసల, శాక్య, కాశీ రాజ్యాలు ఈ లిచ్ఛవీయుల ముందు బలహీన మయ్యాయి. లిచ్ఛవీయుల ప్రాణాలూ, ప్రేమా అకుంఠితాలు.

లిచ్ఛవీయుల దేశంలో ఉన్న చిన్నచిన్న జాగీర్లకు అధిపతులు 'రాజాలు' అనబడేవారు. ఈ రాజాలంతా అవసరమైనప్పుడు సంవత్సరానికి ఒకసారి నిర్ణీతమైన దినాలలో వైశాలీ నగరంలో సమావేశమవుతూండేవారు. నగరంలోని ముఖ్య సభామండపమైన సంధాగారంలో కూర్చొని లిచ్ఛవీయులు తమ సమాజ మంతటిపైన గానీ, దేశ మంతటిపైన గానీ ప్రభావం కలిగించే సాంఘిక రాజకీయ విషయాలన్నింటిని గూర్చి ముచ్చటించుకునేవారు. ప్రతి వ్యక్తీ స్వతంత్రంగా మాట్లాడవచ్చు. సమయం వచ్చినప్పుడు యుద్ధం చేయవచ్చు. వాదం ముదిరినప్పుడూ, ఉపాయము తోచనప్పుడూ లిచ్ఛవీయుల పవిత్ర గ్రంథం 'త్రివేణి పుస్తకం' ఆధారంగా తుది నిర్ణయం చేయబడేది. 'త్రివేణీ పుస్తకం' ఆధారంగా సంధాగారంలో ఒకసారి నిర్ణయింపబడ్డ తర్వాత దాన్ని ఎవ్వరూ ప్రతిఘటించలేరు. అలా చేయడము దేశద్రోహమనీ, పాపమనీ, భావింపబడేది. ఆ కాలంలో నిజమైన, ఆదర్శవంతమైన ప్రజావాదం ఉండేది. హిమాలయాల వడిలో ఉన్న లిచ్ఛవీయ దేశం ప్రియద్వీప మంతటిలో సాటిలేనిదిగా ఉండేది.

లిచ్ఛవీయులు వేదాలు ప్రమాణాలని స్వీకరించరు. బ్రాహ్మణులపై దృష్టి ప్రసరించరు. నిరర్థక భోజనం, ధనవ్యయం, దానికి తగిన వ్యర్థ ప్రలాపం వారి కిష్టంలేకపోవడమే దీనికి కారణం. వారికి నాలుగు వర్ణాలలోనూ భేదభావం లేదు. స్వతంత్రంగా ఉండడానికీ, మాట్లాడడానికీ, జీవించడానికీ సదుపాయం ఎవరికైనా ఉంది. కనుకనే యితర రాష్ట్రాలతో పూర్తి సంపర్కం ఉన్నా, వారి ఆచార వ్యవహారాలను అనుసరించి జీవిస్తూ

(45 వ పేజీ చూడండి)

# తేలికైనది, వేగమైనది, బలిష్ఠమైనది బియస్ఎ BSA

ప్రఖ్యాతమైన బియస్ఎ తిరిగి వచ్చింది! ప్రపంచ ప్రఖ్యాతమైన దీని సాంస్కృతిక సౌందర్యము బలిష్టత కూడా ఉత్సాహ పూరితులైన యువకులు సునాయాసంగా సైకిలు తొక్కే ఆనందాన్ని తిరిగి కలిగించడానికి భారతదేశంలో ఇవి తిరిగి ప్రవేశ పెట్టబడుతున్నాయి. ప్రపంచంలో ఈ దేశమందు మేలిరకపు సైకిళ్లను తయారు చేసేవారిచే ఇది కీర్తి కలిగిన అధిక ప్రమాణాలకు అనుగుణ్యంగా ఇప్పుడు తయారు చేయబడింది

వీరిచే తయారుచేయబడినది
టి ఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53
ప్రొప్రయిటర్లు ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్,
మదరాసు

**బైక్‌ను గురించి ఆలోచిస్తున్నారా!**
**బియస్ఎని జ్ఞాపకం పెట్టుకోండి**



 బియస్ఎ మీ ఇంటికి భూషణము

JWT/TIC/BSA/2059

# సింహాద్రి - టెర్లిన్ షర్టు

పి.యస్. నారాయణ

పెండ్లాం సీతా మహాలక్ష్మి పోరగా పోరగా, సింహాద్రి కొన్నాడు చొక్కాకు టెర్లిన్ గుడ్డ. తరువాత నాలుగు రోజులు తిరక్కముందే నాలుగు ఇచ్చి చొక్కాగా కుట్టించుకున్నాడు. ఆపైన నెలరోజుల వరకు కొత్త పెండ్లాంతో హనీమూన్ తిరిగినట్లుగా, విడవకుండా దాన్ని తొడుక్కొని వూరంతా తిరిగాడు.

ఆ తరువాతే కథ ప్రారంభమయింది.

అదెలాగంటే—

క్షమించాలి—జరిగింది చెప్పందే జరగబోయేది మీకు అసలే అర్థంకాదు గనుక, "రాజుగారి ఏడుగురు కొడుకులు వేటకు బయల్దేరిందగ్గరనుండి' మొదలెడతాను......

* * *

"గురువా!......"

తలుపు తీశాడు సింహాద్రి.

తలుపు తీసేటంతవరకూ ఆగలేని సింహాద్రి, మరోసారి, "గురువా...."అన్నాడు

సింహాద్రి చిరాగ్గా మొహం పెట్టి శ్రద్ధగా వినుక్కున్నాడు. "ఛీ! ఛీ! సిగ్గులేకపోతే సరి......ఎన్నిసార్లు చెప్పించుకుంటావ్?...... సరదాగా అనదలుచుకుంటే 'గురూ' అను......లేదంటావా మా వాళ్ళు పెట్టిన పేరు వెంకట సింహాద్రి అని పిలు....అంతేగాని 'గురువా' యేంటి గురవయ్యలాగా!......"

"క్షమించు గురూ!"

"అదుగో......"

"క్షమించు....నోరికి నాలిక జారిపోతుంది......వెధవ నాలిక...... ఇంతకీ విషయ మేమిటంటే......"

"వూ......చెప్పు!......"

"భజగోవిందం ఉన్నాడు చూడు...."

"వా డెక్కడా కనబడటంలేదే !" అన్నాడు మొహమెత్తి సుబ్బరాజులవైపుగా చూస్తూ.

సుబ్బరాజులు మొహం పైనంత చేసుకొని "పిచ్చన్నే గాలి తీయబోకుగురూ!... నేను చెప్పేది విను ! ...... భజగోవిందం లేడు...... వాడేమో టెర్లిన్ గుడ్డల కట్‌పీసెస్ వాయిదాల పద్ధతిమీద అమ్ము తున్నాడు.....నీవు ఎన్నాళ్ళబట్టో కొనాలని ఏడుస్తున్నావుగదా అని......?"

వి.వే. సింహాద్రి సుబ్బరాజులు మాటలకు గతుక్కుమన్నాడు....అలా అని తేరుకోకముందే లోపలనుండి సీతామహాలక్ష్మి పిలిచింది. పిలిచి, అరటిపండు వలిచి, చేతులో పెట్టినట్లుగా, వెంటనేవెళ్ళి ఒక ముక్క పట్టుకొచ్చుకోండి' అని గూడా విడమర్చి చెప్పేసింది.

సింహాద్రికి సుబ్బరాజుల్ని నమిలి మింగేద్దామన్నంత కోపం వచ్చింది. ఒక వైపున తను డబ్బుల్లేక అల్లల్లాడుతుంటే మధ్యలో వీడు పెట్టి......కుంపటిలాగ మొహమూ, వెధవ మాటలూ నూ 'యూ సెడ్ గుడ్!' అందామనుకున్నాడు.....కాని, ఆ మాటలు కడుపులోనుంచి నాలికమీద కొచ్చేటప్పటికి సీతామహాలక్ష్మి చేతులు తుడుచుకుంటూ బయటకొచ్చి "అన్నగారూ! లోపలికి రండి. కుర్చీలో కూర్చోండి. ఈ గుక్కెడు కాఫీ త్రాగండి...... ఆ వివరాలన్నీ చెప్పండి" అన్నది.

అప్పటికి—సింహాద్రి తాటిగా సుబ్బరాజుల్ని తంతానన్నాడు. గుద్దుతానన్నాడు. పేగులరేపి మెడకు వేసేస్తానన్నాడు.

ఉహూ..... అబ్బే ఆ సుబ్బరాజుగాడికి ఇవేమన్నా అర్థమయితేనా? ఈ మధ్య పిలోప్ కమ్యూనిటీ ట్రాంచి పెట్టుకొని 'లాక్ ఎట్ లాక్ !' ప్రాక్టీసు చేస్తున్నాడు. నాలుగు అని చప్పరించేశాడు.

సీతామహాలక్ష్మి కొనుక్కొచ్చుకోమని మొదలెట్టిందంటే ఆపటం నరునివరతరమా? ఆ పాయింట్ మీదే సుబ్బరాజుల్ని వెంట పెట్టుకొని భజగోవిందంషాపుకు వెళ్ళాడు సింహాద్రి.

భజగోవిందం వీళ్ళను చూస్తూ "హిహి" అన్నాడు—అతడి పరిభాషలో 'స్వాగతం' అని!

సింహాద్రి తలవంచుకొనే, సమాధానంగా "హిహి......హిహి....."అన్నాడు.

"కూర్చోండి.....హిహి"

"ఫరవాలేదు......హిహి......హిహి!"

"చాలా రోజులకు....ఏదో....హిహి ...మీ పాదధూళితో మా కొట్టు పావనం చేశారు.....ఈనాటికైనా అలాంటి శ్రమ తీసుకున్నందుకు—నాయందు దయవుంచినందుకు—నాలోని ఆనందం......హిహి.....వర్ణనాతీతం!"

సుబ్బరాజులు ఖంగ్గులు పూరించి సింహాద్రివంక, "గాలి కొడుతున్నాడుగురూ" అన్నట్లుగా చూచాడు.

భజగోవిందం మొదలుపెట్టాడు "హిహి!......ఇంతమంది ఇక్కడవున్న సమయంలో (వీనే సింహాద్రి, సుబ్బరాజులతో కలుపుకొని ఐదుగురు) నలుగురికీ తెలిసేలా నలుగురికి తెలిసిందే అయినా మరోసారితెలిసేలా ఆ విషయం చెప్పేయాలని నా ఉద్దేశ్యం...హిహి...రోజు రోజుకు అన్ని వస్తువుల ధరలూ ఆకాశాన్నంటి పోతున్నాయి.....మధ్యతరగతి కుటుంబాలలో వున్న మనం.....మనం కొనలేని అంతస్తులోకి అవి ఎక్కి పోతున్నాయి ...... మనకూ కోరికలుంటాయి. మనకూ ఆశలుంటయి...మన పిల్లలూ దర్జాగా ఉండాలనుకుంటారు.....కాని ఎలా? హిహి... మన కొచ్చే డబ్బు చాలదు.....మన వాళ్ళ కోరికలకో పగ్గాలుండవు......ఒకవేళ వాళ్ళ కోరికలు తీర్చారో.....మనకు అవేళ్ళో భోజనం నాస్తి....అందుకే హిహి......ఈ భజగోవిందం ఒక కొత్త పద్ధతి కని పెట్టాడు......ముఖ్యంగా మన బోటి మధ్యతరగతి కుటుంబికుల కోసం.....దాని మూలకంగా ... హిహి......మనమూ పై అంతస్తులో వున్న వాళ్ళతో సమానమవుతాము......అటు డబ్బుకు ఇబ్బంది పడం......అది ఏమిటయ్యా అంటే... హిహి......వాయిదాల పద్ధతి. ఒక టెర్లిన్

ముక్క ఈ వేళ్లో తీసుకోండి...దాని ఖరీదు నాలుగు పెట్టి భాగించి నాలుగు నెలల్లో ఇవ్వండి.....అందునా మీ మీ జీతాలు వచ్చిన తరువాతనే...కాదంటే నే నేమీ అనుకోను.....రెండో తారీఖునాడైనా ఇవ్వండి.....ఎందుకంటే......ఇది నలుగురూ మెచ్చే, నలుగురికీ నచ్చే ప్రజాసేవలాంటిది గనుక ...... హిహి ..... ప్రజాసేవే మా లక్ష్యం..... జై భజగోవిందా కట్‌పీస్ సెంటర్!"

ఆయనగారి ఉపన్యాసానికి ఎవరూ చప్పట్లు కొట్టకపోయినా— కొట్టినంత హడావుడిగా "హిహి—హిహి— హిహి" అంటూ డబ్బాలో వడేసి వూగించిన రాళ్లలా నవ్వేశాడు భజగోవిందం.

ఉన్నట్లుండి నవ్వును ఆపేసి, సింహాద్రి మొహంలోకి కళ్లు చిలికించి చూస్తూ "మీరు నల్లటివాళ్లు.....తెల్లటి ముక్కొకటి పట్టుకు వెళ్లండి, బాగుంటుంది!" అన్నాడు.

"నీ బొంద! ఏదో ఒకటి ఇటు తగలేయ్!" అనుకొని పొట్లం కట్టిచ్చిన ఆ ముక్కను చేతితో ఇరికించుకొని— తన పెండ్లాం సీతామహాలక్ష్మినీ, పొద్దున్నే తగిలిన వెధవ అద్దెసంగాడు సుబ్బరాజుల్నీ, భజగోవిందాన్నీ శాపనార్థాలు పెట్టుకుంటూ, టైలర్ దగ్గరకు వెళ్లి అతగాడు చెప్పినట్లుగా ఐదు నిముషాలు ధ్యాన్నంచేసి ఇంటికొచ్చాడు సింహాద్రి.

సింహాద్రి కింద మెట్టుమీద ఉండగానే పిలవేసింది సీతామాలక్ష్మి. "ఏ రంగు తీసుకున్నారు? ..... ముదురు ఎరుపా? ముదురు నీలమా?" అన్నది.

ఆమె గారి ఉద్దేశ్యంలో ఈ ప్రపంచంలో ముదురు ఎరుపు, ముదురు నీలంలో వున్న అందం మరో రంగులో లేదని!

సింహాద్రి వినుగ్గా, ఆఫీసరు చేతితో తిట్లుతిన్న మొఖాన్నిపెట్టి ఇవ్వుతున్నాడు. "ఇంకా ఆ రంగు టెర్లిన్ గుడ్డలు ఎవరూ కనిపెట్టలేదుట..... అందుకే ఒక తెల్ల గుడ్డ పుచ్చుకొని— మీ అమ్మమ్మకు జాకెట్లు కుట్టే నర్సింహానికి ఇదీ కట్టి పని ఇచ్చావా!"

"అయ్యొయ్యో!..... ఎంత పని చేశారండీ! ....... వెంటనే వెళ్లి తీసుకురండి... వాడిక్కడ [illegible]... వాడు కుట్టిన జాకెట్లు తొడుక్కునేగా ఎన్నాళ్లకీ రాక గిలగిలలాడి చచ్చిపోయింది మా అమ్మమ్మ అయ్యొయ్యో వెంటనే వెళ్లిరండి!" అని నెత్తి నోరూ కొట్టుకోసాగింది సీతామాలక్ష్మి.

"ఛీ! నోర్మూయి!....బుద్ధి లేకపోతే సరి.....ఏమిటాగోల .. నాంచారమ్మ..... నా నా అబ్బ మెచ్చిన వాడిచేత కుట్టించుకుంటూ!"

సీతామాలక్ష్మి [illegible]

అప్పటికే సింహాద్రి వెధవ అర్భకత్వం తిండని పేడిమీదవున్నాడేమో బొటనవేళ్ల మీద నిలబడి, "పళ్లు పొట్లాలతో విన్నా పుట్టింటికి పంపిస్తా......పేడ డాబామీదనుండి తూకి చస్తా!" అన్నాడు విసురుగా.



# సింహాద్రి టెర్లిన్ షర్టు

నాలుగోనాడు సాయంత్రం అప్పటికి సీతాలక్ష్మి పదిహేనుసార్లు చెప్పింతరువాత వరసింహాం ముందు నిలబడి జేబులోని నాలుగున్నర అణ్ణమీదపెట్టి చేంటు తాడు సింహాద్రి.

తరువాత ఇంటికివెళ్ళి ఆరు సంవత్సరాల క్రితంపెళ్ళిలో కుట్టించిన ఆచొక్కా తగిలించుకున్నాడు. ఆలా ఒంటికి తగిలించుకున్న తరువాత గర్వమేసింది. అద్దంలో చూచుకుంటుంటే చిరునవ్వు దానంతటదే తిక్కణ్ణించోవచ్చి మొఖాన్నంతా అతుక్కుపోయింది.

హుషారుగా, "సీతా!"......ఒకసారి ఇటు వస్తావ్" అన్నాడు.

సీతాలక్ష్మి వస్తూనే టెర్లిన్ చొక్కాలోవున్న మొగుణ్ణి చూచి "ఎంత బావున్నారండీ! ...... సినిమాలో హీరోలా!" అని ఫక్కున నవ్వేసింది.

సింహాద్రికి అర్థంకాలేదు. ఆవిడ మొఖాన్ని చిన్నదిచేసి, "ఎందుకలా నవ్వుతావ్......నాకు బాగులేదా ?" అన్నాడు.

"ఛ! మీకు బాగులేదంటె .. నాకు బాగా లేదన్నట్లే! మీకేం.. దర్జాగా.... దొరబాబులా ఉన్నారు!"

సింహాద్రి......సిగ్గుతో మెలికలు తిరిగిపోయాడు.

కాళ్ళూ, చేతులూ సరిచేసుకుంటూ, "పెట్టెలో ఐదు రూపాయలూ జేబులో పెట్టు!" అన్నాడు.

"ఎందుకూ ?" అంది.

"ఆలా బజారువైపుకు వెళుతున్నాంగా ఎవన్నా కొనుక్కొస్తాను తింటానికి...... అంటే ఈ శుభ సమయంలో ఇద్దరికి చిన్న పార్టీ యిసు్తన్నామన్నమాట!"

"ఆల్‌రైట్!" అంటూనే పెట్టెలో ఐదు రూపాయిలూ చేతిలోకి తీసుకుంటూ, "ఒక అరడజను బజ్జీకాయలున్నూ, ఒక పావలా వేగోడీలు పట్రండీ!" అంది ముందుకు పడ్డ జడను వెనక్కు వేసుకు నిలబడుతూ.

"అబ్బే!......హోటళ్ళలో అవి అమ్మరు.....కావాలంటే కొరబ్బాండీ.....కాదంటావో...... బజార్లో కరిబూజకాయ్!" అంటూనే జేబులో ఐదు రూపాయల కాగితం పెట్టుకొని, బయటకు కన బడుతుందో లేదోనని ఒకసారి చూచుకొని, తృప్తిపడి, పోలీసోడు తరుముతున్న దొంగలాగా బయటపడ్డాడు సింహాద్రి.

సీతాలక్ష్మి ముప్ఫైఆరువంకర్లుపోయినే తన మూతిని సరి చేసుకుంటూ తలుపేసుకుంది!

* * *

రెండో తారీఖు ఉదయందాకా బాగానే తిరిగాడు సింహాద్రి.

తరువాతే అనిపించింది— ఏ బావిలో నన్నా (ఆ ఇంటి వాళ్ళు పూరుకుంటే) దూకి చస్తే బాగుంటుందనిపించింది.

ముప్ఫై ఒకటోవ తారీఖు చీకటి బడి పోతుండగా టెలిగ్రాం వచ్చింది— సీతామహాలక్ష్మి చెల్లెలు వెంకట మహాలక్ష్మికి ఏదో సంబంధం వచ్చిందట— ఆమెగారి మొగుణ్ణి నిర్ణయించేందుకుగాను ఈమెగారు వెళ్ళాలిట!

"ఛీ! ఛీ! సిగ్గులేకపోతే సరి" అను కున్నాడు—మావమీద— అసలు కారణం పెండ్లాన్ని పంపటానికిగాదు— టెలిగ్రాం ఖర్చులు టెలిగ్రాం మనియార్డరు పంప లేదని!

"ఎవళ్ళ పనులకు వాళ్ళు డబ్బు లివ్వక పోతే......ఇక్కడేవన్నా చెట్టున కాస్తున్నా య్యనుకున్నాడా మీ బాబు!" సీతాలక్ష్మిమీద కసురుకుందామనుంత కోపం వచ్చింది.

మర్నాడు సాయంత్రం ఆమెను రైలెక్కించి, ఆమర్నాడు పొద్దున్నే పాత బాకీలన్నీ తీర్చుకొని—మిగిలిన డబ్బులు లెక్క చూచుకుంటే—నాలుగు రూపాయిలతొంభైతొమ్మిది పైసలు మిగిలినయ్!

గుండాగినంత పనయి పైకిచూస్తే, నోరు తెరుచుకొని— భుజగోవిందంగాడి గుడ్డతో కుట్టించిన చొక్కా కనబడింది.

ఇక బజార్లో నడుస్తుంటే ఆ భుజగోవిందం కనబడి 'హిహి' అన్నాడు. తన పని 'హిహి' నే!

ఇప్పటికే ఒకరోజు గడిచిపోయింది!

అప్పేసికోనటమే ఒక బుద్ధి తక్కువ.... తరువాత దానిని ఇవ్వలేక తెల్ల మొఖం వేయటం మరో బుద్ధితక్కువ....తక్కువ.. అవును ...... డబ్బులు తక్కువ .... తెల్ల వార్లూ కలవరించి...... తెల్లవారుజామున నిద్రపోబోతూ—ఈనెలో ఆ సుబ్బరాజుల



# సింహాద్రి టెర్లిన్ షర్టు

వడి ఇంటికి వెళ్లి తలుపేసుకొని తీక్షణంగా ఆలోచించసాగాడు.

సింహాద్రి ఆశ్చర్యానికి అంతులేదు.

"వచ్చి డబ్బులిచ్చి వెళ్లమని చెప్ప వల్సింది బోయి ముక్క తీసుకు వెళ్ళమంటాడేం?"

ఎంత ఆలోచించినా, దాని భావం తిరుమలేశుడుకి గూడా అర్థంకాలేదేమోనని పించింది!

కాని చిట్ట చివరకు ఒక నమ్మకానికి రావటంతో కొస్తంత హుషారు పుంజుకొని స్వయంపాకం తిన్నాననిపించుకొని ఆఫీసుకెళ్లాడు.

—అంటే భజగోవిందం తనకు ఒక ముక్క ఇచ్చిన సంగతి మర్చిపోయాడన్న మాట— ఆ మాట అనుకున్నప్పుడల్లా తనకు ఇష్టమయిన మైసూర్‌పాకు తిన్నట్లే అనిపించింది.

కాని మనస్సుకు భయం బంకలాగా అంటుకొని అప్పుడప్పుడు బయటకు తొంగి చూస్తూనే ఉన్నది.

—ఏదో ఒకనాడు ఇది పగలకపోతుందా అని — నిజాన్ని భజగోవిందంగాడు తెలుసుకొని వానా కూతలూ కూయడానికి!

కానీ—ఏమైతే అదైందని— అసలు అప్పుడు జేబులో డబ్బులు ఖాళీ గనుక సర్ది చెప్పుకున్నాడు సింహాద్రి.

అయితే—

ఆ టెర్లిన్ చొక్కా వేసుకోవటం మాత్రం మానుకున్నాడు!—ఆ చొక్కాతో ఉన్న తనని చూచి భజగోవిందంగాడు ఎక్కడ చొక్కా పట్టుకుంటాడో అని!

సరిగ్గా—పదోరోజు మధ్యాహ్నం—ఆదివారం—పన్నెండు గంటల రైలుకు సీమాలక్ష్మి ఇంటికొచ్చింది—వెంట చెల్లెలు వేమాలక్ష్మిని గూడా తీసుకొని!

వస్తూనే తన చెల్లెమ్మ కాబోయే అర్ధాంగుడు ఎంత అందమైనవాడో వర్ణించి చెప్పి తరువాతే భోజనం చేసింది.

సింహాద్రి విర్ణిష్టంగా వూకొట్టి వూరుకున్నాడు.

సాయంత్రం ఐదు గంటలకు—అన్నిట్లాండి సినిమాకు వెళదామంది సీతామాలక్ష్మి.

డబ్బు ల్లేవన్నాడు—మరదలుకు వినబడకుండా!

"ఇవాళ ఆరూ నూరయిన సినిమా చూడాల్సిందే!......తలకాయ తాకట్టయినా పెట్టి పట్టండి!" అంది.

"నాకు మరోటి స్పేర్ గాలేదు.... మీ బాబు దగ్గిరుంటే పట్టా....ఆ పని చేసి తరువాతన్నీ చేద్దాం." అన్నాడు. మొండిగా.

ఇక లాభం లేదనుకుంది సీమాలక్ష్మి.

"సరే! పదండి.... నే నిస్తా!"అంటూ ప్రయాణం చేసింది.

అయిదన్నరకల్లా సీమాలక్ష్మి ఆఖరిసారిగా పౌడర్ రాసుకోవటం గూడా అయిపోయింది.

సింహాద్రి లేచి నిలబడ్డాడు. "నేను రెడీ!" అంటూ.

వెంకట మహాలక్ష్మి—సీతా మహాలక్ష్మి వెనకాల నిలబడింది.

"అదేమిటి?......మీరింకా చొక్కా తొడుక్కోలేదేం?" అంది మొఖంచిట్లించి మొగుడి వంక చూస్తూ.

"చచ్చానుపో! నీకు కళ్లజోడుకూడా కావాలన్నమాట!" అన్నాడు ముందు వేసుకున్న చొక్కాను చూచుకొని, తరువాత మరదలువంక తొంగిచూచాడు— తను.

ఆ అమ్మడు నవ్వలేదు—గాని ఇతగాడు తొంగిచూచేటప్పటికి అర్థంగాక బిక్కమొఖమేసింది!

"నా బొంద..అది గాదండి—ఆ టెర్లిన్ చొక్కా ఎప్పుడు తొడుక్కుంటారు?.... ఇల్లంటప్పుడుకాక!...లేకపోతే దాన్ని పూడిచి పెడతారా? ఎత్తుకు తింటారా?"

గతుక్కు మన్నాడు సింహాద్రి.

"అదిఇప్పుడు వద్దులే"అన్నాడు— కాస్త గొంతు వణికిందిగూడా.

"ఎందుకు వద్దు ......తీసుకు రండి ముందు!" అంది.

"వద్దాన్నానా—"గొంతుసాగదీశాడు.

"అందుకే........ ఎందుకు వద్దన్నారూ అంటున్నాను!" ఇంకాస్త సాగతీస్తూ


ఎంబ్రోసియా
సిరప్‌లు
ఎంబ్రోసియా

పండిత డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేటు) లిమిటెడ్
మదరాసు-17

సలహా
క్షీణించియున్న ఆనందం, బలం, శక్తిని తిరిగి యిచ్చేందుకు ఆహ్లాదకరమైనది. నరాల బలంకు సైవూతకు వాజీ తైలం. 1 సీసా రు 11-50 స్పెషల్ రకం అర్జంటు గుణంకు రు. 27/- విద్యాన్ని వంపుతూ జవాబుకు కవరు పంపాలి.
డాక్టర్ రత్నం సన్స్,
Sex Specialists (Estd 1904)
ఆజంపురామార్కెట్‌వద్ద, మలకపేట బిల్డింగ్స్
హైదరాబాద్—36 (ఆంధ్రప్రదేశ్)

3 నెలలు ఉచిత బహుమతి
అందమైన స్త్రీలకు మిక్కిలి నూతనమైన ఆకర్షణీయమైన డిజైనులలో రంగులలో నరిక్రొత్త కాశ్మీర్ ఆర్ట్ చీరెలు వచ్చివున్నవి. స్టాకు పరిమితం. పెద్ద సైజులలో మాత్రమే లభించును. 1కి రు.10/- 2కి రు.18/- 3కి రు.25/- 4కి రు.32/- రెండు లేక అంతకు పైన చీరెలకు ఆర్డరు పంపిన వారికి సిల్కు నెక్‌టై లేక జాకెట్టుగుడ్డ ఉచితం సిఆర్డరుని పోస్టు పార్శిల్ ద్వారాపంపబడును.
ARVIND AGENCIES (WAPT-55)
P. B. 1408, Delhi-6.

పెట్లోంచి చొక్కాను బయటకు లాగింది.

—చివరకు— ఆమెపోరు భరించలేక తప్పిపోతూ దాన్ని వంటికి తగిలించుకొని హాలిట్లోకి నడిచాడు. వెనగ్గా వచ్చిన సీతామహాలక్ష్మి ఇంటికి తాళం పెట్టింది.

టిక్కు టిక్కుమంటూ రోడ్డుమీద పడవసాగాడు.

హాలుదగ్గరకు వెళ్ళారు.

కుర్చీ టిక్కెట్లు కొనుక్కొని లోపలి కెళ్ళారు—తరువాత ఐదునిమిషాలకే కొంప అంటుకున్నాయి!

భజగోవిందం గూడా అదే సినిమాకు వచ్చాడు. అదేక్లాసు టిక్కెట్టు కొన్నాడు. అదేవరుసలో వచ్చి కూర్చున్నాడు. అదే పనిగా నాలుగువైపులా చూడసాగాడు.

చటుక్కున సింహాద్రి జేబులోంచి రుమాలు బయటకు లాగి —మొఖం కనబడకుండా—భజగోవిందం వైపుకు — అర్ధనారీశ్వరుడిలా పెట్టి నేసుకొని—పుట్టు కొస్తున్న చెమటలకు ఎలా అడ్డం వేయాలా అని ఆలోచించ సాగాడు.

సీతాలక్ష్మి మొగుడిని చూసింది.

కళ్ళెగరేస్తూ, "ఎందుకు ఆకేబారుమాలా అట్లా వేసుకున్నారు?" అంది.

"అటునుంచి చల్లటిగాలి కొడుతుంది..! చెవులో పోటుగూడా పుడుతుంది... లోపల ఏమైనా కురుపులేస్తున్నాదేమోనని అనుమానంగావున్నది!" అని ఒకపచ్చి అబద్ధం అని, "అందుకే సినిమాకు వద్దంటే విన్నావా?" అని గూడా అందామనుకొని ఇందాక అందుకనలేదని గుర్తుకొచ్చి నోరు మూసుకు కూర్చున్నాడు.

"నాకేం రావటంలేదే!" అంది.

"నేను అడ్డం వున్నాగా!" అన్నాడు నవ్వుకుంటున్నట్లుగా

"మీదంతా చోద్యంగా ఉన్నదే..... మరీ చిన్న పిల్లాడిలా......ఎవరన్నాచూస్తే నవ్వుతారు!" అంది వెగటుగా మొఖం పెట్టి.

"నవ్వటమేంగాదు ..... ఆ చూడాల్సిన ఆయనచూస్తే చొక్కా గూడా పట్టు కుంటాడు!" అందామనిపించింది. కాని నోరు జారితే తరువాత తీసుకోవటం


స్టాన్‌ఫ్లార్స్ కర్చిఫ్ పెర్‌ఫ్యూమ్స్

భాక్త స్టాన్‌ఫ్లార్స్

మల్లె కుసుం

STANFLORS (AROMATICS)

MANUFACTURERS INDUSTRIAL PERFUMES : AROMATIC CHEMICALS

INDUSTRIAL ESTATE, VISAKHAPATNAM

MADRAS OFFICE :- (PB No. 129, MADRAS.1)

స్టాకిస్టులు, డిస్ట్రిబ్యూటర్లు కావలెను.



కాల్గేట్ టూత్ బ్రష్

మీ దంతములను ఎక్కువ శక్తివంతముగా శుభ్రపరుచునట్లుగా తయారైనది!

క్రొత్త!
ఎంతో ముచ్చటైన!!
కాల్గేట్
మాస్టర్ టీక్స్
టూత్ బ్రష్

4 సైజుల
గట్టిది
మెత్తనిది

Colgate
COLGATE NYLON TOOTH BRUSH

శాస్త్రీయముగా తయారుచేసిన కాల్గేట్ టూత్ బ్రష్ మీ దంతాల సందులలోకి సులభంగా పోతుంది. ముందు భాగాన్నీ, వెనుక భాగాన్నీ కూడా మరింత తేలికగా శుభ్రపరుస్తుంది. కాల్గేట్ టూత్ బ్రష్‌తో మీ దంతాలను రక్షించుకోండి.

దంతక్షయాన్ని నిరోధించే కాల్గేట్ విధానము

కష్టమనిపించి మాటాడకుండా కూర్చున్నాడు.

సీమాలక్ష్మి కాసేపు ఏదేదో గొణుక్కుని— బెల్లుకొట్టి, న్యూస్‌రీల్ మొదలెడితే—దానివంక చూస్తూ కూర్చుంది.

తరువాత సింహాద్రి— ఇంట్రవెల్‌కు ఐదు నిముషాలు ముందుగా బయటకు వెళ్ళి, ఐదు నిముషాలలో తరువాత లోపలి కొచ్చి—వచ్చేటప్పుడూ, పోయేటప్పుడు ఒకళ్ళిద్దరు ప్రేక్షకుల కాళ్ళకు చక్కిలిగింతలు పెట్టి—వాళ్ళ చేత చివాట్లు తిని— సినిమా అయిన తరువాత పావు గంటకు అంతా వెళ్ళిపోయిన తరువాత—సీతా మహాలక్ష్మి, ఆలస్యానికి ఎంత మొత్తుకున్నా వినకుండా—బయట పడ్డాడు— గుండెమీద చేయి వేసుకొని!

సినిమా చూచొచ్చిన తరువాత గూడా సీమాలక్ష్మి విసుగుతునే వున్నది—కసురుకుంటూనే వున్నది!

ఎందుకంటే—

“పాపం సావిత్రిని సూర్యకాంతం చాల కష్టాలు పెట్టింది!” అన్నది దార్లో వస్తూ.

“అరె! పాపం! ఎప్పుడూ?” అన్నాడు నోరు జారి అమాయకంగా. భజగోవిందాన్ని గురించి ఆలోచిస్తున్న సింహాద్రి.

ఆ పాయింటు పట్టుకొని మొర్నాటి పొద్దుటివరకూ దులుపుతూనే వున్నది— ఏంచేస్తాడు? నోర్మూసుకు కూర్చున్నాడు తన తప్పు గనక!

మూడోరోజున సీమాలక్ష్మి తమ్ముడు శ్రీనివాసులువచ్చి సీమాలక్ష్మిని తీసుక వెళ్ళాడు—ఒక రెండు రోజులుండి మరీ,

అక్కడా సింహాద్రికి పెండ్లాంతో తగులాటే.

తన తమ్ముడితో ఎక్కడికన్నా వెళ్ళేటప్పుడు—టెర్లిన్ చొక్కా వేసు కెళ్ళమంటుంది సీతా మహాలక్ష్మి—అసలు బాధ పెండ్లాంకు చెప్పలేక ‘ఖస్సు’మంటూంటాడు సింహాద్రి.

ఎనిమిది రూపాయిలుగావుగాని—సింహాద్రి ప్రాణాలను నిలువునా తోడేస్తున్నాయి.

భజగోవిందం కొట్టున్న బజారువైపుకు

# సింహాద్రి టెర్లిన్ ఖర్మం

వెళ్ళి అప్పుడేపెట్టలేదన్నా—రెండు వారాలపై చిలుకంయింది!

ఒకవిధంగా ఏ ఖర్మం — అన్నివిధాలా! సింహాద్రికి ఆ టెర్లిన్ చొక్కాతో బుర్ర వేడెక్కిపోయింది. అట్లాగే పిచ్చిగూడా ఎక్కేస్తుందే మని భయంగూడా వేసింది.

అందుకే—

ఈ బాధ భరించలేక చూస్తూ చూస్తూ మరెవడి దగ్గరన్నా అప్పు చేసి భజగోవిందం మర్చిపోయిన ఆ అప్పును తీర్చాలంటే మనస్కరించటంలేదు———మొదలెడితే బంకలా నాలుగు నెల్లవరకూ వదల్డు. ఇవ్వకుండా ఉందామా. వాడికి గుర్తు కొచ్చి తన మెడకాయ ఎక్కడ పట్టుకుంటాడోనని భయం! చస్తుంటే—

ఒక అయిడియా పది రోజుల తరువాత తట్టింది.

అదైనా—తన తమ్ముడు వేమాద్రి వచ్చి ఓనాల్రోజులు ఏదో స్వంత పని మీద ఉండి వెళ్ళిపోదామని గడపదాటుతుంటే—

వెనక్కు పిలిచాడు “ఇదుగో తమ్ముడూ ఈ టెర్లిన్ చొక్కా....నీకు బాగుంటుంది గాని తీసుకెళ్ళి తొడుక్కోరా!” అని అతగాడి చేతిలో పెట్టి తన చేతులు దులుపుకున్నాడు. గుండెలమీద పేరుకు పోయిన బరువును తుడిచి అవతలపారేశాడు.

ఆ అతగాడు ముందు వద్దన్నాడు. తరువాత నా కెందుకన్నాడు. ఆపైన మరీ అలా అనేసేస్తుంటే వెనక్కు తీసుకుంటాడేమో నని భయమేసి—వెధవ కులుకొకటి కులికి సరే నన్నాడు!

ఈలోగా వెనక గదిలోనుండి ఇదంతా చూస్తున్న సీతా మహాలక్ష్మి అన్ని విధాలా సన్నిద్ధమైంది.— నిప్పు కణికలు నాలుగు తీసుకొని కంట్లో వేసుకొంది. ఆపైన విసిన కర్రతో విసరసాగింది.

సింహాద్రి తేలిగ్గా, హుషారుగా వెనక్కు తిరిగి, “ఆహా! ఎంత హాయిలే ఈ రేయి!” అని పట్ట పగలే గుండెలమీద ఒకటే రుద్దుకోసాగాడు.

సీమాలక్ష్మి గడపవతల కాలుపెట్టింది.

“ముందు ఈ విషయం చెప్పండి— నేను ముఖ్యమా? మీ తమ్ముడుముఖ్యమా?”

సింహాద్రి అప్పుడే హుషారు తిని ఉన్నాడేమో, “రెండుసార్లు చదివినా కాశీ మజిలీ కథల్లో —నా కెక్కడా ఇలాంటి ప్రశ్నలు తగిలినట్టు గుర్తు లేదే!” అన్నాడు ఎటో చూస్తూ.

ఈ సమాధానంతో ఆమె వేరే లోపలికి వెళ్ళి ఆజ్యం తెచ్చుకోవాల్సిన అవసరం లేకపోయింది.

మరింత మీద కొచ్చింది. “మీడొంక తిరుగుడు సమాధానాలు నాకు పనికిరావు. నేను మీ భార్యను అవునా గాదా”?

“అవును!”

“నామాట కేమైనా విలువ ఉన్నదా?, లేదా?”

“ఉన్నది!”

“అయితే నేను కొనుక్కోమంటే కొనుక్కున్న ఆ టెర్లిన్ చొక్కా మీ తమ్ముడి కెందుకిచ్చారు?”

“తమ్ముడుగదా అని!”

“అదే ఎందుకు ఇచ్చారంటున్నాను?”

“అందుకే ఇచ్చానంటున్నాను!”

సింహాద్రి ‘సై’ అంటె ‘సై’ అనేందుకు సిద్ధంగా వున్నాడు. చొక్కా చేతులు గూడా పైకి లాగాడు.

కాని ఇతగాడి చేష్టలకీ, సమాధానాలకీ సీమాలక్ష్మి కోపం పెరిగి తాటిచెట్టంత అయింది.

ఇక ఆపుకోలేక “అంతే మొన్నొచ్చిన మా తమ్ముడి కెందు కివ్వలేదు?” అన్నది అక్కసం వెళ్ళకక్కుతూ.

“మీ తమ్ముడు గనుక!”

అంతే మొగుడు మీద కోపంతో ఇల్లెగిరిపోయేలా కేక వేసింది. నానా మాటలూ అంది—పుట్టింటికి పోయి తిరిగి రానని గూడా దబాయించింది. వీటికి దేనికి సింహాద్రి సమాధానం చెప్పకపోవటంతో రాత్రికి పస్తు పడుకొని—మొగుణ్ణి గూడా పస్తు పడుబెట్టింది.

సింహాద్రి ఉత్సాహంమీద ఉన్నాడేమో—అందునా పెళ్ళైనంతరువాత భార్య

మీద మొదటిసారిగా పొందిన ఘన విజయంలో ఆ రాత్రల్లా కలల్లో కాశ్మీర్‌లో తిరిగాడు.

* * *

తెల్లవారింది. కోడి కూసింది. సింహాద్రి ఇంటి తలుపులు దబ దబా మోగసాగినవి.

సుబ్బరాజాలా వాడాపుడికి సింహాద్రికి కోపమొచ్చింది. వాడిని నమిలి మింగేద్దామన్నంత విసురుగా వచ్చి తలుపుతీశాడు.

భజగోవిందం ఎదురుగ్గా నిలబడి "హిహి" అన్నాడు. అంతటితో వూర్కోకుండానే "మీరు క్రిందటి నెల్లో గూడా జమ చేయలేదు......రేపు ఫస్టుకయినా రెండు నెల్లది పర్దేయాలి!" అన్నాడు. ●


* నాచర్మ సౌందర్యమునకు లక్స్ దివ్యమైనది *

అన్నది వైజయంతిమాల




వైజయంతిమాలకున్నట్లే మీకున్న చర్మసౌందర్యం మూల్యం... ఆ సాధనమే దానికి తగినది!

సుందరియైన వైజయంతిమాల ఇలా చెప్పుచున్నది, చర్మసౌందర్యం మీకు, నాకు, తారలకు అమూల్యం. ఎందుకంటే, అది వనితను పరిపూర్ణ సౌందర్యంగా వుంచుతుంది. నాసౌందర్యకారియైన సబ్బు...లక్సును మీరు ఎందుకు వాడి చూడగూడదు? దాని మీగడవంటి నురగ ఎంతో సౌమ్యమైనది...నాకు ప్రియమైన పరిమళం గలది. లక్సును మీ సౌందర్యసాధనగా రోజూ వాడండి.

లక్స్ టాయ్‌లెట్ సబ్బు సినీతారలకు సౌందర్యమునిచ్చే శుద్ధమైన, సౌమ్యమగు సబ్బు తెలుపులోను, నాలుగు వానవెల్లి రంగుల్లోను వున్నది

లింటాస్-LTS. 189-140 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి




జ రి గి న క థ

జీవితంమీద విరక్తితో ఆత్మహత్య చేసుకోబోతున్న రాధను, రక్షిస్తాడు ఆ ఊరి డాక్టరు వేణు. వేణుకు తన దయనీయ జీవితగాథనంతా వినిపిస్తుంది. రాధ చిన్నతనంలోనే తండ్రిని కోల్పోతుంది. స్కూలు ఫైనలు ప్యాసయిన రాధను ఒక మంచి సంబంధమే అనుకుని, భాస్కరానికిచ్చి పెళ్ళి చేస్తాడు అన్న ప్రకాశరావు. అనుకోని విధంగా ఒక ప్రమాదంలో భాస్కరం మరణిస్తాడు. రాధకు అన్నగారింట్లో కూడా ఆదరణ కరువవుతుంది. కూతురిని గురించిన దిగులుతోనే తల్లి శాంతమ్మ ప్రాణాలు విడుస్తుంది. ఆంజనేయులు రాధపై అభాండాలను సృష్టిస్తాడు. రాధను తనవెంట తీసికెళ్ళి ఉద్యోగం ఇప్పిస్తానని ఊరడిస్తుంది పార్వతి. వేణు తనను వివాహం చేసుకోమని కోరిన సంగతి పార్వతికి చెప్తుంది రాధ. క్షణికోద్రేకానికిలోనై హృదయం సహకరిస్తుంది రాధ, వేణు భయపడాల్సిన అవసరంలేదనీ, తా నామెను తప్పక వివాహం చేసుకుంటానని చెప్తాడు వేణు. వేణు దగ్గరనుంచి ఉత్తరం రాలేదని రాధ కలవర పడుతున్న సమయంలో, అతని ఉత్తరం ఆంజనేయులు చేతిలో పడుతుంది. రాధ ఆంజనేయులుతో వెళ్ళిపోయిందని ఊరంతా గుప్పుమంటుంది. వేణు హతాశుడవుతాడు. మనశ్శాంతిని ఆశిస్తూ, పార్వతి ఇంటికెళ్ళిన రాధకు పరిస్థితులు ఇంకా కుదుటబడవు. ఆందోళన, ఆత్మవిశ్వాసాలు మాత్రమే ఆమెకు మిగిలాయి.

## 11

ఎండ కొంచెం చల్లబడగానే పార్వతీ రాధా ఇందిరమ్మగారింటికి వెళ్ళారు. వీళ్ళు వస్తామని ముందుగానే ఫోన్‌చేసి ఉండడం వల్ల ఆవిడ వాకిట్లోనే ఎదురయి అభిమానంగా పలకరించి లోపలికి తీసుకు వెళ్ళింది.

ముగ్గురూ వెళ్ళి ఓ గదిలో కూర్చున్నారు. ఆ గదిలో ఓ మూలగా చిన్నచిన్న పీటలు జంబుఖానాలు పేర్చి ఉన్నాయి. వాటివంకే చూస్తున్న పార్వతి నుద్దేశించి ఆవిడ నవ్వుతూ అంది.

"ఇది క్లాసు రూమ్. ఇక్కడైతే మనం అన్ని సంగతులు మాట్లాడుకోవచ్చునని ఇలా తీసుకొచ్చాను. మాకింకా ఆఫీసురూం అనీ, టీచర్సురూమ్ అనీ ఏమీలేవు. ప్రస్తుతం ఈ రెండు గదులు, ఈ పక్క వరండా అంతా స్కూలుకి వాడుకుంటున్నాము. ఈ నెలాఖరికి ఆ ప్రక్కన యింకో చిన్న యూనిట్ మొదలుపెడతాను. ప్లాను శాంక్షనయిపోయింది. అదికూడ తయారయితే స్కూలు విస్తృతం చెయ్యడానికి వీలుంటుంది."

"ఔనులెండి. నెమ్మదిగా ఎక్స్టెండ్ చేసుకోవచ్చు. మొదటే అన్ని హంగులు కావాలనుకుంటే ఎలా."

వాళ్ళిద్దరి సంభాషణ వింటూ మవునంగా కూర్చుంది రాధ. ఆమె గుండె దడ దడ లాడుతోంది. భయంతో ఒళ్ళంతా చిరుచెమటలు పోస్తున్నాయి. తల వంచుకుని నెమ్మదిగా ఎవరూ చూడకుండా అరచేతులలో పట్టిన చెమటని రుమాలుతో తుడుచుకొంటోంది

కొంతసేపు ఈ కబురు ఆ కబురు అయ్యాక,

"అయితే రాధని రేపటినుండి రమ్మంటారా ?" అంది పార్వతి.

"అలాగే. రేపే అప్పాయింటుమెంటు ఆర్డరు కూడ టైపు చేయించి యిస్తాను." అంది ఆవిడ రాధవంక చూస్తూ.

"థ్యాంక్సు" అంది రాధ తన శక్తినంతా కూడదీసుకుంటూ.

"ఎస్. ఎస్. ఎల్. సి. సర్టిఫికేటు ఉందామ్మా ?" అంది ఇందిరమ్మగారు. ఎంతో ఆదరంగా.

"తెచ్చానండి"— అంటూ— బ్యాగ్ తెరచి ఆ సర్టిఫికేటు ఆమెచేతి కిచ్చింది రాధ.

ఆమె ఏదో మాట్లాడుతూ పుస్తకం తెరచి మార్కులు చూస్తుంటే,

"మీరు మార్కులు చూడక్కర్లేదు. మా రాధ ఎప్పుడూ క్లాసులో అన్ని సబ్జక్టులలోనూ ఫస్టే." అంది పార్వతి చిన్నగా నవ్వుతూ.

ఆవిడ అలా చూస్తూనే, "అదృష్టం" అంది యథాలాపంగా.

"ఆ అదృష్టం అంతటితోటే ఆగిపోయింది. ఇప్పుడు నా అంతటి దురదృష్టవంతు లెవరూ ఉండరు." అంది రాధ బాధాతప్త కంఠంతో.

దెబ్బతిన్నట్లు తలెత్తి చూసింది ఇందిరమ్మగారు. "నువ్వలా అనుకోవద్దమ్మా కొన్నాళ్ళు వోపికపట్టాలంతే. మళ్ళీ ఆ అదృష్టం నిన్ను వెతుక్కుంటూ వస్తుంది. నేను నీకు తల్లిలాంటి దాన్ని. నా ఆశీర్వచనం పూరికే పోదు. నా మాట మీద నమ్మకముంచి కొన్నాళ్ళు ధైర్యంగా ఉండు." అంది ఆప్యాయత తొణికిసలాడుతూండగా.

చల్లటి పన్నీటిజల్లు లాంటి ఆ సానుభూతి వాక్యాలకి రాధ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఏమో చెప్పబోయింది. కాని పూడిపోయిన కంఠం అందుకు అవకాశం ఇవ్వకపోవడంతో మవునంగా కళ్ళతోనే కృతజ్ఞత తెలుపుకుని మళ్ళీ తల వంచుకుంది.

"మిగతా టీచర్సు ఏమైనా అనుకుంటారేమోనని తన భయం." అంది పార్వతి ఆ ముగ్గురి మధ్య అల్లుకుపోయిన నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ.

"ఎవ్వరూ ఏమీ అనుకోరు. అతను పై చదువుకి విదేశాలకి వెళ్ళాడని చెప్దాం. అంతవరకూ పూరికే ఉండడం ఎందుకని రాధ ఉద్యోగం చేస్తోంది అనుకుంటారు.

రాధా? నువ్వెప్పుడూ నవ్వుతూ సంతోషంగా ఉండాలి. వాళ్ళందరిముందు ఇలా విచారంగా బాధపడుతున్నట్లు మాత్రం ఉండకు. దానివల్ల వాళ్ళందరికీ లేనిపోని అనుమానాలు కలుగడమే కాకుండా, నీకు

కలగబోయే వివాహానికి కూడ శ్రేయస్కరం కాదు.

ఇదుగో పార్వతీ ! రాధ ఎప్పుడూ సంతోషంగా ఉండి వేళపట్టున ఆహారం విశ్రాంతి తీసుకునేలా చూసే భారం నీది.''

''పరిస్థితిని అర్థంచేసుకుని, నో ఉపాధి కల్పించి ఆదరించడానికి ఇష్టపడింది. అదే పదివేలు.'' అనుకున్న పార్వతికీ, రాధకీ ఆమె మాటలు అమిత ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించాయి. ఆ భావాలు వారి వదనాల్లో ప్రతిబింబించడంతో,

''నా మాటలు మీ కాశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి కదూ. నేను చెప్పింది వింటే మీ సంశయం తీరిపోతుంది.'' అంది రుద్ధ కంఠంతో. ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఆమెలో కలిగిన ఈ హఠాత్పరిణామానికి మరీ తెల్లబోయారు వాళ్లిద్దరూ. కొద్ది క్షణాల తరువాత ఇందిరమ్మగారే మొదలుపెట్టింది.

''అవసరం వచ్చింది కాబట్టి ఇప్పుడు మీకు చెప్తున్నాను. ఇది నాకూ మావారికి తప్ప ఇంట్లో పిల్లలకి కూడ తెలియదు.

నాకో చెల్లెలుండేది సంధ్య అని. చాల అందమైనది, తెలివైనది. చురుకైనది. తను బి. ఏ., ప్యాసు కాగానే పెళ్లి చేయాలని అమ్మ తొందరపెట్టింది. అయితే తన అంద చందాలకీ తెలివితేటలకీ తగినవాడు దొరక్క, కాలేజీలు తెరవగానే ఎం. ఎ.,లో చేర్పించారు నాన్నగారు. 'ఎప్పుడు సంబంధం కుదిరితే అప్పుడే మాన్పించేయొచ్చులే. ఇప్పు డూరికే ఇంట్లో కూర్చోపెట్టడం దేనికి ?' అంటూ అమ్మని సమాధానపరిచారు.

ఆ ఎం. ఏ., చదువుతూండగానే సంధ్యకు ఒక అబ్బాయితో పరిచయం అయ్యింది. వాళ్ల క్లాసే. కాని మన కులం కాదు. అయితేనేం, వాళ్లిద్దరూ ప్రేమించుకున్నారు. పెద్దల నెదిరించి అయినా వివాహం చేసుకోడానికి నిశ్చయించుకున్నారు.

ఆ వేసంగి శలవలకి అతను యింటికి వెడుతూ, ఎలాగైనా తల్లిదండ్రుల్ని ఒప్పించి వారం పది రోజులలో వస్తానని, వాళ్ళు ఇష్టపడకపోయినా సంధ్యని పెళ్లిచేసుకోవడం మాననని ధైర్యం ఆశలు కల్పించి రైలెక్కాడు. వారం పది పదిహేను రోజులు గడిచిపోయాయి. అతను తిరిగి రాలేదు. పోనీ ఉత్తరం అయినా వ్రాయలేదు. సంధ్యలో అదుర్దా ఎక్కువయింది. తను ఇదిగో యిప్పుడు రాధ పరిస్థితే ఎదుర్కోవలసి వచ్చింది. అయినా ఎవరికీ తెలియకుండా ఒకటి రెండు నెలలు గడువు కొచ్చింది. అప్పటికీ అతని జాడ తెలియలేదు. ఇంకొద్ది రోజులలో కాలేజీలు




తెరుస్తారు. అప్పటి కేలాగయినా అతను వచ్చి తీరుతాడని ధైర్యం చెప్పుకుందేమో.

కాని, ఈలోగా అనుకోని సంఘటన జరిగింది. అప్పుడు నేనుకూడ అక్కడే ఉన్నాను. నో ఉదయం కాఫీ త్రాగుతూ త్రాగుతూ వాంతి చేసుకుని కళ్లు తిరిగి పడిపోయింది సంధ్య. ఇంట్లో అంతా ఖంగారుపడ్డాం. అన్నయ్య వెంటనే కారు వేసుకు వెళ్లి డాక్టర్ని వెంటబెట్టుకు వచ్చాడు. ఈలోగా సంధ్యకి తెలివి వచ్చింది. తన కప్పుడు బాగానే ఉన్నదని, డాక్టరు అవసరంలేదని - చెప్పారది. నాన్న, నేనూ కలిసి తనని బలవంతంమీద బలిపీఠం మీదకు తీసుకువెళ్లే యజ్ఞపశువులా ఆ డాక్టరు దగ్గరికి తీసుకువెళ్లాం. ఆ డాక్టరు మాకు చిన్నప్పటినుండీ తెలిసినవాడే. మా నాన్నగారి వయస్సుంటుంది. ఆయనంటే కేవలం డాక్టరనే గౌరవమే కాకుండా ఏదో అభిమానం చనువు ఉండేవి. ఆయన కూడ మమ్మల్ని తన పిల్లలలాగే వాత్సల్యంతో చూసేవాడు. సంధ్య వణికిపోతూ వెళ్లి ఆయన దగ్గర తలొంచుకుని నిలబడింది.

ఆయన సంధ్యనో కుర్చీమీద కూర్చోపెట్టి గుండె, నాడి, నాలుక, కళ్ళు అన్నీ పరీక్ష చేశాడు. మధ్యలో ఆయన కళ్లు చిత్రంగా మెరిశాయి. విచిత్రంగా సంధ్య మొహంలోకి చూశాడు. ఒక్కసారి బెదురుగా ఆయన మొఖంలోకి చూసి కళ్ళు వాల్చేసుకుంది. కారణం ఇదీ అని నేనా క్షణంలో వూహించలేకపోయాను.

అన్ని పరీక్షలు పూర్తిచేసి, ''జనరల్

రు. 6/- కు చీర

అందమైన వడికిన నూలుతో, రంగులతో మనోహరమైన చీరలు ఒక రు. 6/- రెండు రు. 12/- మూడు రు. 16/- ... రు. 20/- ... 2 ... 5%

L. D. AHUJA & SONS (APTW)
Post Box No. 1346, Delhi-6.





డాక్టర్ వృత్తి చేయండి !

ఇంట్లో కూర్చొని హోమియోపతి ... వంటి మంచి హోమియోపతి ... ఎం.డి. ... (హోమియో) గోల్డ్ మెడలిస్ట్ పొందండి. ... ఉచిత ప్రాస్పెక్టస్ కు వ్రాయండి.

IMPERIAL HOMEOPATHIC COLLEGE
(APT), Jammu, Tawi-12.





... రు. 157-15 ... రు. 12-13 ... రు. 147-15 ... రు. 17-97 ... రు. 87-97 ...

DR. SHERMAN, F.C.S.
161, R. N. Guha Road, Calcutta-28



ఉచితము ! ఉచితము !!

తెల్లమచ్చలు

... 1924 ...

Sri Krishna Chandra Vaidya
(A. P.) P.O. Katri Sarai (Gaya)


## నిరీక్షణ

సిక్ నెస్, అంతకన్నా మరేంలేదు" అంటూ టానిక్కేదో వ్రాసి ఇచ్చాడు. వెడుతూ వెడుతూ నాన్నగారి భుజంమీద చెయ్యి వేసి, "ఎక్కడా రావడమే మానేశావు బొత్తిగా. వీలయితే సాయంత్రం వోసారి రా! కాస్సేపు చదరంగం ఆడుకుందాం." అంటూ యథాలాపంగా చెప్పినట్లు చెప్పి కారెక్కాడు.

జబ్బు ఏమీ లేదని డాక్టరు చెప్పాడు కదా అని మేమంతా నిశ్చింతగా ఉన్నాం. కానీ సంధ్య మాత్రం అలాగే నీరసంగా నిస్త్రాణగా ఆ కుర్చీలో వాలిపోయింది. ఆ కొద్ది క్షణాలలోనే ఏమిటో రక్తం అంతా నీరయిపోయినట్లు మొఖం అంతా పాలిపోయి తెల్లగా అయిపోయింది.

"ఇప్పుడు అన్నయ్య వచ్చేటప్పుడు మందు తెచ్చిపెడతాడమ్మా. భయమేంలేదు. వెళ్ళి కాసేపు పడుకో. ఆ నీరసం తగ్గుతుంది." అన్నారు నాన్నగారు. అసలు ఆయనకి మొదటినుంచీ పిల్లలందరిలోకీ సంధ్య అంటే అభిమానం ఎక్కువ.

సంధ్య వెళ్ళి తన గదిలో పడుకుంది. పదిగంటలవేళ బలవంతంమీద రెండు మెతుకులు తిని, ఆ మధ్యాహ్నంఅంతా కూడ బయటికి రాకుండా ఆ గదిలోనే పడుకుంది.

సాయంత్రం సరికి నా నిశ్చయానికి వచ్చినట్లుంది. లేచి తల దువ్వుకుని, ఇష్టమైన చీర కట్టుకుని ముస్తాబై బయటికి వచ్చింది. అప్పటికి అన్నయ్య క్లబ్బుకి వెళ్ళిపోయాడు. నాన్నగారు డాక్టరుగారితో చదరంగం ఆడుకోడానికి వెళతానంటూ చెప్పి వెళ్ళిపోయారు. సంధ్య తొణుక్కుంటూ, "నే ఇప్పుడే వచ్చేస్తానమ్మా. నా ఫ్రెండుని చూసి" అంది. మేమూ అమ్మా వద్దని వారించాం.

"లేదమ్మా. ఆ మందు రెండు డోసులు పుచ్చుకున్నారికి ఎంతో బలం వచ్చినట్లుంటుంది. ఇప్పుడే నా అరగంటలో వచ్చేస్తా. తను నా కోసం వెయిట్ చేస్తుంటుంది." నా మాట వినిపించుకోకుండా వెళ్ళిపోయింది.

అన్నట్లుగానే నా అరగంటలోనే సంధ్య తిరిగి వచ్చేసింది. తన మొఖం ఎంతో ప్రశాంతంగా కళకళలాడుతూ ఉంది.

తరువాత కాస్సేపటికి నాన్నగారు వచ్చారు. హాల్లో కూర్చుని ఉన్న నేను ఆయన్ని చూస్తూనే ఉలిక్కిపడి భయంవేసి గదిలోకి వెళ్ళిపోయాను. ఆయన్నంత రౌద్రమూర్తిగా నే నెప్పుడూ చూడలేదు. ఊహించుకోలేదు కూడ. ఆయన తిన్నగా కాళ్ళయినా కడుక్కోకుండా వంటగదిలోకి వెళ్ళారు. ఆయన చెప్పింది విని అమ్మ నెత్తి కొట్టుకుంటూ సంధ్య గదిలోకి వెళ్ళింది. ఏమిటో అంగారు అని నేను కూడ వెళ్ళాను.

డాక్టరుగారి అనుమానం నిజమేనని ఒప్పుకుంది సంధ్య. అమ్మ ఒళ్ళు తెలియని కోపంలో ఏమేమో యిష్టంవచ్చినట్లు అనేసింది. అయినా దేనికీ సమాధానం చెప్పలేదు తను.

* * *

ఆ రాత్రి ఎవ్వరం భోజనాలు చెయ్యలేదు. ఎవరి గదుల్లో వాళ్ళం ఆలోచిస్తూ కూర్చున్నామే కాని, ఒక్కళ్ళకీ నిద్ర కూడ పట్టలేదు. మర్నాడు మామూలుగానే తెల్లవారింది. అమ్మ, నాన్నగారితో క్రిందటిరోజు వచ్చిన కోపం కొంచెం తగ్గింది. ముందు కర్తవ్యం ఏమిటా అనే ఆలోచన వచ్చింది. చివరికి ఎలాగో ఆ సంబంధమే ఖాయంచేసి పెళ్ళి జరిపించేద్దామనే నిర్ణయానికి వచ్చారు.

అందరం లేచాం కాని సంధ్య మాత్రం లేచి బయటకు రాలేదు. "నువ్వెళ్ళి పిలుచుకురా" అని నాన్నగారు అమ్మని పంపించారు.

అమ్మ గదిలోకి వెళ్ళిన కొద్ది క్షణాలలోనే "అయ్యో తల్లీ. ఎంతపని చేశావే" అంటూ గొల్లుమంటూ ఏడుపు వినిపించింది. అందరం గదిలోకి పరుగుపెట్టాం. ఏముంది ? సంధ్య నిశ్చలంగా నిర్మలంగా పడుకుని నిద్రపోతోంది. పెదవులమీద చిరునవ్వు కూడ అలాగే ఉన్నట్లుంది.

3—6—[illegible]

తరువాత తెలిసింది, ఆ క్రితం సాయంత్రము తను వెళ్ళి తన క్లాస్‌మేట్ ఎవరికో మెడికల్ షాపుంటే. అతన్ని ప్రతిమాలి ఏదో వంకని స్లీపింగ్ పిల్స్ తెప్పించుకుందని. ఇలా జరుగుతుందని అతనికి మాత్రం ఏం తెలుసు.

ఆ సాయంత్రం అమ్మ గదిలో పడుకుని ఉండి ఉండి ఏడుస్తూంటే నేను ప్రక్కనే కూర్చుని ఓదారుస్తున్నాను. నాన్నగారు అన్నయ్యా హాల్లో కూర్చునున్నారు. ఎవరిదో క్రొత్త గొంతు వినిపిస్తే నేను లేచి హాల్లోకి వచ్చాను. ఆ ఆగంతకుని చూసి గతుక్కుమన్నాను. అతను ఒకటి రెండు సార్లు సంధ్యకోసం మా యింటికి వచ్చాడు. అతను తన క్లాసుమేట్ అనీ, చాలా తెలివైనవాడనీ, అందుకని అతని నోట్సులు తీస్కుంటున్నానని సంధ్య చెప్పింది. ఆ స్నేహం ఇలా పరిణమిస్తుందని నే నూహించలేక పోయాను.

ఏముంది ? తనూ సంధ్య ప్రేమించుకున్నామని, తమ సంగతి వాళ్ళ నాన్నగారికి చెప్తే ఆయన అంగీకరించలేదనీ, దిప్పటికైనా ఆయన మనస్సు మారుతుందేమోనని ఈ రెండు నెలలు ఓపిక పట్టామనీ చెప్పాడు. ఇంక ఆయన ఎంతకీ ఒప్పుకోకపోవడంతో ఆయన్ని ఎదిరించి వచ్చేశామనీ, సంధ్యని పెళ్ళిచేసుకుని, ఇక ఆ సంవత్సరం చదువు సాగే అవకాశంలేదు కనక ఏదైనా ఉద్యోగం చూసుకుంటాననీ చెప్పాడు.

అతను పాపం ఎంతో బెదురుతూ బెదురుతూ చెప్పినట్లే, అన్నయ్య అహంకారం అణుచుకోలేక ఒక్క వుదుటున లేచి వెళ్ళి ఒకచేత్తో అతని షర్టు కాలరు పట్టుకొని రెండోచేత్తో ఈ చెంపా ఆ చెంపా వాయించేశాడు. నాన్నగారువెళ్ళిఅడ్డుపడక పోతే అతను స్పృహతప్పేవరకు అన్నయ్య అలాకొడుతూనే వుండేవాడేమో. నాన్నగారు వాళ్ళిద్దర్నీ విడిపించి సంగతి సందర్భాలు అర్థంకాక అయోమయంగా తన వంక చూస్తున్న అతనితో, "నాయనా, అంతమంచి ఉద్దేశ్యం ఉన్నవాడివి నో ఉత్తరము ముక్కయినా వ్రాయకపోయావా ? [illegible] చూపి సంధ్య నిన్నరాత్రే ఆత్మహత్య చేసుకుంది." అన్నారు అశ్రు ధారలను ఒత్తుకుంటూ.

"నిజంగా!" అన్నా డతను నమ్మలేనట్లు.

"నిజం కాకపోతే నీతో హాస్య మాడతామటరా ?" అంటూ అన్నయ్య హుంకరించాడు.

"ఏమిటో ఎప్పటికప్పుడు వ్రాద్దామనుకుంటూనే అశ్రద్ధ చేశాను. పైగా మా నాన్న ఒప్పుకోలేదని వ్రాయడానికి సిగ్గుపడ్డాను. నేను వచ్చాకే అన్ని సంగతులు చెప్పొచ్చు ననుకున్నాను. కాలేజీ తెరిచే దాకానైనా తను నా కోసం చూడవలసింది" అన్నాడు వణుకుతున్న కంఠంతో.

తరువాత నాన్నగారు చెప్పినది విని సిగ్గుతో తల వంచుకుంటూ "నా కంత ఆలోచన లేకపోయింది. నా నిర్లక్ష్యంవల్లనే సంధ్య చచ్చిపోయింది. నేనే తనని చంపేశాను." అంటూ రెండు చేతులలోనూ మొఖం దాచుకుని గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

అతను వచ్చి వెళ్ళింతరువాత నాన్నగారి బాధ మరీ ఎక్కువయిపోయింది. "నేనుకూడ ఒళ్ళుతెలియని కోపంతో దాన్ని ఏవేవో అని నొప్పించాను. కాస్త వివేకంతో ప్రవర్తించి, ఆ సాయంత్రమే వాళ్ళ ఎడ్రసు కనుక్కుని, ఉత్తరం వ్రాస్తానని ధైర్యం చెప్పివుంటే అంతపని చేసేదికాదు." అంటూ కుమిలిపోయారు. అమ్మ సరేసరి. సరే తరువాత ఎంత బాధ పడ్డా పోయిన ప్రాణం తిరిగి రాదుగదా" అంటూ నో దీర్ఘ విశ్వాసం విడిచి కళ్ళు తుడుచుకున్నారు ఇందిరమ్మగారు.

అంతవరకూ ఆ కథలో లీనమైపోయి ఆమె దుఃఖాన్ని పంచుకున్న శ్రోతలిద్దరూ జాగ్రదావస్థలోకి వచ్చి, వాళ్ళ సంతాపాన్ని వ్యక్తం చేశారు.

"పాపం ఆవిడెంత బాధపడుతుందో ఆ చెల్లెలికోసం. బాధపడిన హృదయమే ఇంకొకరి బాధని అర్థంచేసుకోగలదు. అందుకే నేనంటే ఆవిడ కంత జాలి, సానుభూతి" అనుకుంది రాధ.

గత స్మృతుల పునశ్చరణతో కలత బారిన అంతరంగాన్ని అదుపులోకి తెచ్చుకుని మళ్ళీ ఇందిరమ్మగారే అంది,

"ఇది జరిగి యిప్పటికి దాదాపు పాతిక సంవత్సరా లవుతుంది. అయినా ఆనాటి సంఘటనలన్నీ నా కెప్పుడూ కళ్ళకి కట్టినట్లే ఉంటాయి. సంధ్య మరి ఒక్క రోజు ఓపిక పట్టివుంటే తన జీవితం ఎంత సంతోషంగా గడిచిపోయేదోనని వూహించుకుంటూంటే చెప్పలేని బాధ కలుగుతుంది. పోనీ, చదువుకున్నది—కొద్ది రోజులు ఎక్కడికైనా వెళ్ళిపోయి తన బ్రతుకు తాను బ్రతుకుదామనైనా తనకి తోచలేదేమో. అలా వెళ్ళిపోవడం కుటుంబానికి కేదో కళంకం అని అనుకుంటుంది. తను చచ్చిపోతే మాత్రం, అనుకునేవాళ్ళ



# ఇదిగో కాల్గేట్ వారి... బ్రిస్క్ టూత్ పేస్టు



**విరివియైన నురగతో పళ్ళలో మెరుపుని క్రొత్త ముత్యపు తెల్లదనం పొందండి!**

ఇదిగో కాల్గేట్ బ్రిస్క్— శ్రేష్ఠమైన దంతధావన పదార్థములను ఉత్పత్తి చెయ్యడంలో ప్రపంచమంతటా గొప్ప అనుభవము గడించిన సంస్థ అందించు క్రొత్త టూత్ పేస్టు.

ఆరోగ్యవంతమైన జీవనానికి పళ్ళు అత్యంత పరిశుభ్రముగా ఉండాలని, మీ చిరునవ్వును శోభాయమానం చెయ్యడానికి అద్భుతమైన ముత్యపు తెలుపును కూర్చాలని మీ దంత వైద్యులు మీకు చెబుతారు. మరి, శుభ్రమైన దంతముల కోసం ప్రత్యేకంగా కాల్గేట్ బ్రిస్క్‌తో బ్రష్‌తో తోముకోవడమే.

అనివార్యముగా మీ దంతములను శుభ్ర పరచుకోవడానికి కాల్గేట్ బ్రిస్క్ యొక్క చురుకుగా చొచ్చుకొని పోయే విరివియైన నురగను శాస్త్రీయ పద్ధతుల్లో కనిపెట్టారు. ఇది సాటిలేనిది!







CBTP.G.1 TEL.


## నిరీక్షణ

అనేక రకాలుగా అనుకున్నారు.

ఆ సమయంలో అక్కడే ఉన్న నేనయినా తనకి ధైర్యంచెప్పి ఏదైనా సలహా ఇవ్వ లేకపోయానే అనే బాధ ఇప్పటిదాకా నన్ను వెంటాడుతూనే ఉంది. అందుకే పార్వతి ఆనాడు విన్ను గురించి చెప్పినప్పుడు విన్నెలాగైనా ఆదుకోవాలని, సంధ్య జీవితంలా ని జీవితంకూడ అన్యాయం అయిపోయికూడ దని నిశ్చయించుకున్నాను. అందుకే ప్రస్తు తము అంత అవసరం లేకపోయినా విన్ను తీసుకోడానికే నిర్ణయించుకున్నాను. ఎలాగూ వచ్చే సంవత్సరం అయినా ఇంకో టీచరు అవసరం ఉంటుంది. కాస్త ముందుగా తీసుకుంటే నీకు సహాయం చేసినట్లు ఉంటుంది."

"మీకు నా కృతజ్ఞత ఎలా తెలుపు కోవాలో తెలియడంలేదు. మీ నీడని నా జీవితం అంతా నిశ్చింతగా గడిచిపోతే చాలు." అంది రాధ.

"ని కలాంటి అవసరం రా దసలు. కొద్ది రోజులలోనే పరిస్థితులన్నీ చక్కబడతాయి. నువ్వు నీ భర్తతో సుఖంగా కాపురం చేసు కుంటావు. ఈ కొద్ది రోజులు కొంచెం ధైర్యంగా ఉండు. ఎవరడిగినా అతను విదేశాలలో ఉన్నాడని చెప్పు!"

ఇంక మాట్లాడవలసినది ఏమీ లేక పోవడంతో,

"ఇక వస్తామండీ. రాధ రేపు పొద్దున్న వస్తుంది." అంటూ పార్వతి లేచింది. రాధ కూడా లేచి నిలబడింది.

"తొందరేమిటి? కూర్చోండి. కాఫీ తీసుకు వెళుదురుగాని" అందావిడ.

"ఇప్పుడే తీసుకువచ్చామండీ. కొంచెం బజారు వెళ్ళాల్సిన పని కూడ ఉంది. మళ్ళీ ఎప్పుడైనా వస్తాంలెండి." అంది పార్వతి.

ఇందిరమ్మగారు వాళ్ళిద్దర్నీ బలవంతం చేసి కూర్చోబెట్టి లోపలికి వెళ్ళి ప్లేటలో మూడు కప్పుల కాఫీ పట్టించుకు వచ్చింది. కాఫీ తీసుకుని కొద్ది క్షణాలు కూర్చుని బయలుదేరారు రాధా పార్వతి.

(సశేషం)

ఐరోపా, అమెరికాలకు ఎగుమతి నిమిత్తం ప్రత్యేకంగా సృష్టితమై బయల్పరచబడ్డ సౌఖ్యానందకరమైన సబ్బు, ఇపుడు ఎన్నికగా భారతదేశంలో అమ్మకమగుచున్నది!

గోద్రెజ్ సాండల్...శుద్ధమైన మైసూర్ చందన మూని నుండి నైపుణ్యంగా మిశ్రమం చేయబడిన ఉల్లాసకరమైన ప్రశస్తమగు విలువుండే పరిమళం గలది...ఇట్టి వాటిలో చాలా కాలం విలువుండే చాలా పెద్ద సబ్బు నేడే దీనిని వాడి చూడండి. దాని హాయిగొలిపే పరిమళం మీ కెంతో ప్రీతిమైనది!

**గోద్రెజ్ సాండల్**

...అందరూ ఆనందించగల సౌఖ్యదాయకం

# సమర్పితం
# క్రొత్త
# గోద్రెజ్
# సాండల్





Godrej

గోద్రెజ్ సబ్బులలో ఉత్తమ నామము



నీళ్లబిందె, వెన్నెల రాత్రిళ్లూ, మల్లె పూలూ, నాక్కలజాతూ, వీటిలో ఒక దానికొకటి సంబంధం లేకపోయినా, వీటిలో దేన్నిచూచినా, బాలాంబగారికి పాత జ్ఞాపకాలు కళ్ళముందు మెదులుతాయి. ఆ జ్ఞాపకాలు వెనక బాధ తప్ప ఆనందంలేదు, అదంతా తన యవ్వనంలో జరిగిపోయిన ఒకసుందర స్వప్నం. ఆ సుందరస్వప్నం అడపాదడపా హృదయాంతరాల్లోంచి, బయటికి తొంగిచూస్తూనే వుంటుంది, తనకు ఇష్టం లేకపోయినా.

ఇవ్వాళ తనకూతురు జయలక్ష్మి మూలంగా పాతజ్ఞాపకాలు మళ్ళీ బాలాంబగారి కళ్ళముందు మెదిలాయి.

సాయంత్రం ఎవరో అబ్బాయి జయలక్ష్మి వెంట వచ్చాడు. కాసేపు జయలక్ష్మితో పిచ్చాపాటి మాట్లాడి వెళి పోయ్యాడు. తనకూతురు—ఆ అబ్బాయితో అట్లా చనువుగా మాట్లాడం బాలాంబగారికి— ఎందుకో అసహ్యంగా కనిపించింది.

"ఎవరే ఆ అబ్బాయి?" అన్నది.

"మాకాలేజీలో చదువుతున్నాడు. నా క్లాసే" అంది. కూతురు సమాధానం లోని నిర్లక్ష్యం బాలాంబగారికి చురుక్కున తగిలింది.

"నీ క్లాసయితే మట్టుకు ఇంటిదగ్గరకు రావలసిన అవసరమేమిటి"?అన్నది.

"అవసరముంటే తప్ప రాకూడదేమిటి?" అన్నది జయలక్ష్మి ముఖం చిట్లించి.

కూతురు నోటంట, బాలాంబగారు ఆశించిన సమాధానం అదికాదు. అందువల్ల ఆవిడకు అరికాలిమంట నెత్తికెక్కింది. బాజాగా మందలించడానికి ఐదుఇ— ఘాటుగా నాలుగు అంటించింది. జయలక్ష్మి ఇక నోరెత్తలేక పోయింది. గుడ్లనీరుకుక్కుకుంటూ వెళ్లి మంచం కరుచుక పడుకుంది.

గోడగడియారం తొమ్మిది కొట్టినా జయలక్ష్మి అన్నానికి లేవలేదు. కూతుర్ని వదలి అన్నం తినడానికి ఆవిడకు మనస్కరించలేదు. బ్రతిమాలి అన్నానికి పిలవడానికి బాలాంబగారికి ఇంకా కోపం తగ్గలేదు, జయలక్ష్మిమీద.

కళ్ళ జయట కూర్చొంది. తెల్లని పువ్వులాంటి వెన్నెల. అనుకోకుండానే ఆవిడకు గత స్మృతులు కళ్ళముందు కనిపించాయి.

అవును. అప్పుడు తనకు జయలక్ష్మి వయసే. జయలక్ష్మికన్నా అందంగా వుండేదేమో తను!

లేకపోతే సుందరం తనకోసం అంత ఇదయ్యేవాడా? సుందరం కొత్తగా టీచరుగా వచ్చాడు ఆవూరికి. నొక్కుల జుత్తు కంటికి అద్దాలు—రంగుకొంచెం నలుపైనా—చలాకీగా చూడ ముచ్చటగా ఉండేవాడు. ఎప్పుడూ సిగరెట్టు పెదవుల మధ్య కాలుతుండేది.

సాయంత్రమయ్యే సరికి, పూరిజయటికి చెరువుగట్టుంట షికారువచ్చేవాడు.

బిందెచంకనేసుకొని, సరిగ్గా అసమయానికే వచ్చేది తను. నీళ్లకనికాదు— సుందరాన్ని చూడడానికి!

తీరా అక్కడకి వెళ్లాక దించినకళ్లు పైకి లేవవు. తప్పేసిగ్గు. గబగబానీళ్లు ముంచుకొని వెనక ఎవ్వరో తరుముతున్నట్లు నడచేది.

వెనకనైపు సుందరం తన్ను చూస్తున్నాడేమో....... కళ్లెత్తి చూద్దామంటేకళ్లూ కళ్లూ కలుస్తాయని భయం. వెనకాల తన్ను సుందరం చూస్తున్నా డనుకొనే సరికి—సిగ్గుతో ఒళ్లంతా కుంచించుక పొయ్యేది.

రాత్రి పడుకుంటే సుందరం కళ్లల్లో మెదిలేవాడు. హృదయంలో తేనెటీగల్లా తియ్యటి వూహలు తేనె.

మొదటిరోజు అతనితో మాట్లాడటం ఇప్పటికీ నిన్నా మొన్నా జరిగి నట్టుంటుంది.

నీళ్ళుతీసుకొని వస్తున్నది తను.తన వెనకే వస్తున్నాడు అతను. ఎవ్వరన్నా చూస్తే? ఎందుకో భయం వేసిందితనకు. కాళ్లు తొట్రుపడుతున్నాయి.

"బాలాంబా మీపేరు"? వెనకనుంచి అడుగుతున్నాడు. తను అవును అనలేదు. కాదు అనలేదు. ఏమనడానికీగొంతు పెగల్లేదు. చెక్కిళ్ళు ఎరుపు కెక్కింది.

బాజాగ్గా నవ్వి సుందరం ముందుకెళ్ళి పొయ్యాడు. అతని నోటంట వచ్చిన ఆ ఒక్కమాటా, తన కన్నెమనసులో రేపిన కలవరానికి ఆనందానికి అవధులులేక పొయ్యాయి.

అర్ధరాత్రి తెల్లటి వెన్నెల్లో పక్కా కుదరక, నిద్రరాక, తెల్లవార్లూ జాగరణ చేసింది.

తెల్లవారిలేచి అద్దంలో చూచుకుంటే కళ్లు జ్యోతుల్లా వున్నాయి. అయినా— ఆకళ్లల్లో ఏదో కొత్త కాంతి తొంగి చూస్తోంది.

మొత్తానికి సుందరం గడుసువాడే.

మరునాటి రోజు మళ్లీ వెంటవచ్చాడు. ఏదో మాట్లాడు తాడన్నది తనకు తెలుసు మాటకు ఎట్లాసమాధానం చెప్పాలో మనసుతో రిహార్సల్ వేసుకొంటోంది తను.

"తలలో అన్నిపూలు పెట్టారే బరువనిపించదూ?" వూహించనిప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానం—చెప్పే గడుసుదనం తనకిలేదు. పూలే బరువయితే....... నవ్వే నవ్వును ఆపడానికి తను పెదిమలు బిగపట్టింది.

కుచ్చెళ్లు ఎత్తి పట్టుకున్న చెంగు తీసి పూలు తడుముకుంది.

"మీతల్లో పూలు రాక్కుంటావని భయమా?"

అన్ని కొంటెప్రశ్నలు. దేనికీ సమాధానం చెప్పలేదు తను. ఏమనుకుంటాడో ఏమో? నయ్యారంగా మెడవక్కకి తిప్పి నవ్వి నడక వేగం హెచ్చించింది.

"వెనక ఎవరో తరుముతున్నట్లు అట్లా నడుస్తా రెందుకు. చీరచూడండి ఎట్లా తడిసిందో".

నిజమే— కుక్కిమీద చీరంతా తడిసి నంటుకొంటిజయటు కడుతోంది. సిగ్గూ కోపమూ రెండు కలిగాయి. కస్సున అని "ఆడపిల్లల వెంట నడవటం సరదా ఏమిటి మీకు? ముందు వెళ్లండి" అన్నది.

సుందరం ముందువెళ్లి పొయ్యాడు. ఎంత అపుకున్నా పెదిమల మీద తనకూ నవ్వు విచ్చింది.

అర్ధరాత్రి కళ్లు మూసుకుంటే—మంగళ

[illegible] నోరెత్తాలంటే సిగ్గుపడే, కొత్త పెళ్లి కూతురిలా సిగ్గుపడి వంటినిండా రగ్గు కప్పుకుంది.




ఒకరి శిరోజ సౌందర్యంచూచి మరొకరు ఇక ఎంతమాత్రం అసూయపడవలసిన అవసరం లేదు. రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి.




రీటా కంపెనీ, మద్రాసు 1

అమర్ కోస్
(రిజిస్టర్డు)
స్వచ్ఛమైన గ్లూకోస్ పొడి. శీతల పానీయాలలో కలిపి త్రాగండి.
[illegible]

అమర్‌చంద్ శోభాచంద్
మద్రాసు-1



# త్రిశంకు స్వర్గం

పెళ్లిచేసుకుంటాడేమో? చేసుకోక పట్నం గడుపుకోడానికైతే తను అంగీకరిస్తుందేమిటి? ఎట్లా తెలుసుకోవడం! కన్నెమనసులోని తియ్యటి ఆశ అడుగటానికి సాహసాన్నిచ్చింది.

“నాన్న కట్నం ఇవ్వలేరు. చేసుకుంటారా”? అడిగింది ఒకరోజు.

“కట్నం అవసరం లేదు. నువ్వు చాలు.”

బాలాంబ కళ్లతో తప్ప—నోటితో కృతజ్ఞతని వెల్లడి చెయ్యలేకపోయింది.

తన కన్నెచెర వదలించడానికి నాన్న పడుతున్న అవస్థ గ్రహించలేనంత పసిదేమీ కాదు తను. పైకి వ్యక్తం చెయ్యలేకపోయినా, నాన్న తన విషయంలో పడుతున్న బాధ తనకి తెలుసు.

తనుగాక ముగ్గురాడపిల్లలు. ఇద్దరు మగపిల్లలు. పొలాలమీద వచ్చే ఆదాయమూ అంతంతమాత్రమే. పైగా బాకీలు. సంసారం ఎట్లా లాక్కొస్తున్నాడో తనకు తెలుసు.

సుందరం విషయం చెబితే సంతోషిస్తాడు. విషయం చెప్పడానికి రెండుమూడు రోజులు తికమక పడి, ఎట్లాగైతే నేమి కడకు బయట పెట్టింది.

విని— సంతోషించలేదు. తన్ను అందలం ఎక్కించలేదు. తల బాదుకున్నాడు. ముఖంనిండా అసహ్యం పులుముకొని— తిట్లు అంకించుకొన్నాడు. అడ్డువచ్చినందుకు అమ్మకు వాల్గంటించాడు.

తనతో చెలవం లేదు. అయినా ఏమి తిడుతున్నాడో కూడా వినిపించడం లేదు. పరువు, ప్రతిష్ట, వంశ గౌరవం ఇట్లాంటి పదాలు అస్పష్టంగా విన్నట్లు జ్ఞాపకం. ఇల్లు కైలుఖానా అయింది తనకు. తన ముఖంచూడటానికే కంటగింపులు, అమ్మా నాన్నా ముఖాలు పక్కకు తిప్పుకుంటున్నారు.

మూడురోజులు ఏడుపు తప్ప అన్నం నిద్రాలేదు తనకి. ఏంతప్పు చేశానని తనకీ శిక్ష వేశారో అంతు పట్టలేదు.

“[illegible] (త్రిశంకు స్వర్గం: ఇందులో అడుగుపెడితే తప్పు. ఎట్లా తప్పవుతుందో అడగ కూడదు. అన్నీ సహించడం నేర్చుకోవాలి. అంతకన్నా గత్యంతరం లేదు.”

తన అవస్థచూచి ఓదార్చడానికి వచ్చిన పక్కింటి పిన్నిగారన్న మాటలవి. ఆవిడ ఏమి చెప్పినా తన బుర్రకు అర్థంకాదు. ఆమె ట్రెయినింగు పాసయింది. అయినా వుద్యోగం చెయ్యడం లేదు. ఆమె భర్త టీచరే.

“పిన్నీ నువ్వు వుద్యోగం చెయ్యకూడదూ?” అన్నది ఒకరోజు.

“మీ చిన్నాన్న వద్దంటున్నారే” అన్నది.

“ఏం తప్పా?” అన్నది తను.

ఆరోజు యిలాగే చెప్పింది. ఇవ్వాళ మళ్లీ అదేమాట అంటున్నది. తనకి అర్థం కాలేదు.

మూణ్ణెళ్లు తిరక్కుండానే, నాన్న సంబంధం ఖాయంచేశాడు. సంబంధం ఖాయం చెయ్యడానికి మూడెకరాలపొలం అమ్ముతున్నపుడు కూడా నాన్నలో పెద్ద బాధ కనిపించలేదు. పూరికే సుందరం పెళ్లి చేసుకుంటావంటే—ఆయన తన దంతా ఎవ్వరో కొల్లగొడుతున్నట్లు బాధ పడ్డాడు.!

పెళ్లిఅయినాక బాలాంబ సుందరాన్ని నాన్న తిట్లనీ అన్నీ మరచి పోయింది.

ఇవ్వాళ జయలక్ష్మి మూలాన అదంతా జ్ఞాపకం వచ్చింది.

జయలక్ష్మి ఏం తప్పు చేసిందని తను దండించినట్లు? నరాల్లో జీర్ణించుకు పోయిన సాంప్రదాయం. అంతకన్నాఏంలేదు.

బాలాంబ చప్పున లేచి, జయలక్ష్మి మంచం దగ్గరికి వెళ్లింది. ఎంతగాఏడ్చిందో కళ్లువాచి వున్నాయి. ఏడుస్తూనే ఎప్పుడో నిద్రపోయింది. బాలాంబ కనుగొనుకుల్లో నీళ్లు నిలిచాయి. జయలక్ష్మిని చిన్న పిల్లలా గుండెలకదుముకొని తనూ పడుకుంది! ●

# వుడ్‌వార్డ్స్‌తో

## మీ శిశువును ఆరోగ్యంగాను, ఆనందంగాను వుంచండి

వుడ్‌వార్డ్స్, కడుపునొప్పి, పుల్లదనం, కడుపు ఉబ్బరం, పళ్లు చేయునపుడు కలిగే జబ్బులకు తక్షణ నివారణ కలిగించును, వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్‌ను సర్వదా సిద్ధంగా వుంచుకోండి!




తెలివైన తల్లులు 100 ఏళ్లకు పైగా వాడుతున్నారు.



LPE Aiyars F. 10 Te


# వైజ్ఞానిక గాథాశతి

కూర్చుంది వోడ! ఇక ధ్రువము వైపు జర గాలి, హాయిగా వోడ గదులలో కూర్చున్న అవకాశాలతో వాళ్లు ఉత్తర ధ్రువము మీది వాతావరణాది వైజ్ఞానిక పరిస్థితుల్ని కొలిచి తెలుసుకోవాలి. గొప్పగా వుంది ప్లాను. ఏడాది గడిచింది, వోడ జరిగిన దూరము 190 మైళ్లు! 365 రోజులకు 190 మైళ్లు. రోజుకి 4 ఫర్లాంగులు. ఈలెక్కని వాళ్ల వోడ 'నార్వే' చేరడానికి పట్టే కాలము నాలుగు సంవత్సరాలు.

కొంత కాలానికి వాళ్లకి తెలిసింది తమ వోడ సరిగ్గా ధ్రువము మీద నుంచి పోబో దని. వారికి కావలసినది ధ్రువప్రాంతపు వైజ్ఞానిక వస్తువు. ఆ వోడ మీద సైబీరియా దాకా వచ్చి మంచుగడ్డ మీద గది కట్టి ఆ వోడని తగలబెట్టినట్లు అయింది ఇప్పుడు. అది దాని దారినే దాని వేగాన తోనే పోతుంది, దాన్ని అటూ ఇటూ తిప్ప డానికి వీలులేదు! నాన్సెనూ ఇంకొక్క నావికుడూ ఆ వోడ దిగిపోయి ధ్రువము వైపు బయల్దేరారు. ఇంకా 400 మైళ్లుంది ధ్రువానికి. తిండీ, వైజ్ఞానిక సాధనాలూ, స్లెడ్జిలూ, వాటిని లాగే కుక్కలూతో వాళ్లిద్దరూ ఆ మంచుగడ్డ మిట్టలూ, పల్లములూ ఎక్కిదిగి ఎముకలు కొరికే చలిలో ప్రయాణించారు. ఇదీ నీరు దాటి తెప్ప తగల వెయడమే. ముందుకే ప్రయాణము. తిరోగమనము లేదు. మ్యాపులో నక్షత్రపు చుక్క వున్న చోటి దీవులను చేరడానికి వారికి నాలుగు నెలలు పట్టింది. అప్పటి దాకా ఏ పరిశోధకుడైనా చేరి ఉండిన ప్రాంతాలకు రెండువూర్ల మైళ్లు ఉత్తరానికి ఆ చలిలో చొచ్చుకు వెళ్లాడు నాన్సెను. మూడు శీతువులు గడిపేడు ఒక్క సహాయకుడితో ఆ మంచు ఎడారులలో. అనుకోకుండా ఇంకొక బ్రిటిషు వైజ్ఞానిక దళము వారిని కలుసుకున్నారూ, బయల్దేరిన మూడేళ్లకు నార్వే చేరుకున్నారు. వారు చేరిన పదిరోజుల తర్వాత, నావికులందరితోనూ చెక్కుచెదరకుండా ఫ్రామ్ వోడ నార్వే చేరింది.

నాన్సెను అపజయము ఎరగడు. నార్వే

స్వాతంత్ర్య సంపాదనలో, మొదటి ప్రపంచ యుద్ధ సంక్షోభములో నార్వేకి విదేశాల నుంచి ఆహారాది ముఖ్య పదార్థాలు సేకరించడములో దేశ దేశాల యుద్ధ ఖైదీలను స్వదేశాలకు చేర్చడములో, పదిహేను లక్షల రష్యను కాందిశీకులకు దేశదేశాలలో స్థిరనివాసము కల్పించడములో, టర్కీ పీడిత గ్రీకులనూ, లక్షలాది క్షుధార్త రష్యను కిసానులనూ రక్షించడములోనూ అతనికి విజయమే సిద్ధించింది. చేయవలసిన పనైతే, దాన్ని చేసే దారి ఏర్పడే వుంటుంది. అది పట్టు. మరి ముందుకే నడక. ఏరు దాట దానికే తెప్ప. ఆ తరవాత అవసరమైతే దానితో పొయ్యి మండించు" అంటాడు నాన్సెన్. మహర్షి కాదూ నాన్సెన్? ●

---


# సింగర్ వస్తువుల




సింగర్ అనేకరకాల మెర్రిట్ పంకాలను ఏ కాలమునైనా సరిపోయేవిధంగా అంత చేస్తున్నది. అవి ఎంతో అందంగా ఉంటాయి. స్ప్రేపెయింట్ చేయబడి ... వన్నెల రంగుల్లో తయారైనవి. ఏండ్ల తరబడి నిరాఘాటంగా పని చేసేట్లు హామీ పొందింపబడ్డవి.

వాయిదాల పద్ధతిపై కొనుగోలుకు అన్ని సింగర్ దుకాణముల లోను మరియు ... సింగర్ డీలర్ల వద్దను లభించును.

సింగర్ ప్రఖ్యాతి, మెర్రిట్ పేరూ




* సింగర్ కంపెనీవారియొక్క ట్రేడ్ మార్కు

# వారఫలం

**3-6-1966 శుక్రవారం మొదలు 9-6-1966 గురువారం వరకు.**

**మేషం :** గత వారంకంటే యీవారం బాగా ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులను పరిష్కరించడమే కాకుండా అన్నివ్యవహారాల్లో తగినంత అభివృద్ధిని సాధించగలరు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది. కుటుంబకార్యక్రమాలు శ్రమమీద నెరవేరతాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రాగలవు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :** వారం ప్రారంభంలో వృత్తివ్యాపారాల్లో అనుకోని వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయాని వదలివేయడం మంచిది. అవసరానికి యేదోఒక విధంగా డబ్బు చేతికివస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి ఇదివరకటికంటే బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో మెప్పుకురాని కార్యాభారాన్ని వహిస్తారు. ఆరోగ్యం సామాన్యంగా ఉన్నా మానసికాందోళన కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలువచ్చి సర్దుకొంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిధునం :** ఏ వ్యవహారంలోనూ ఆరంభంలో కనిపించిన అనుకూలత ఆఖరు వరకు నిలవదు. కొన్ని వ్యవహారాల్లో ప్రయాస మీది ప్రయోజనం మరొకరిది కాని పరిస్థితి యేర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కొంతమంది వ్యక్తులు మీమీద వదంతులనువ్యాపింపజేసే ప్రమాదం ఉంది. ప్రయాణాల్లో మీతాలూకు వస్తువులు పోవచ్చును. కుటుంబ సంతోషం లభిస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. సాటివారిలో గౌరవం లభిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కర్కాటకం :** వృత్తివ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించడం వలన వారం సంతృప్తికరంగానే ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో కొత్తసమస్యలు తలయెత్తవచ్చును. ఏదో ఒకవిధంగా అవసరానికి డబ్బు చేతికి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**సింహం :** ఈ వారం మీరు జరిపే వ్యవహారాల వల్ల కేవలం తాత్కాలికమైన లాభమే కాకుండా ముమ్ముందు కూడా తగిన ఉపయోగం ఉంటుంది. ఇదివరకు మీ యెడల ముభావంగా ఉన్నవారు కూడా యిప్పుడు మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. కోర్టు వ్యవహారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు చాలవరకు తొలగిపోతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం తగదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య:** మీ స్వంత పనులు సులువుగానే నెరవేరతాయి గాని, యితరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. రావలసిన డబ్బు మీద ఆధారపడి నూతన వ్యాపారాలు ప్రారంభించడం తగదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వృత్తిలో చాలా శ్రమ మీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషికి స్వల్పాటంకాలు వస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

**తుల :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగానే నెరవేరతాయి గాని, ఫలితం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభించవచ్చును. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం తగదు. ప్రయాణాలు శ్రమ మీద ఫలించగలవు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం :** వృత్తివ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. భారీయెత్తున చేసే వ్యాపారాలు ప్రారంభించడానికి యిది సమయం కాదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో స్వల్పభేదాభిప్రాయాలు వస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది. శుభకార్యాల విషయంలో కొత్తసమస్యలు తలయెత్తవచ్చును. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు—ఉష్ణ సంబంధమైన అనారోగ్యం చేస్తుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని కవ్వించి కలహప్రసంగం తీసికొనిరావడానికి ప్రయత్నిస్తారు. వృత్తిలో అనుకూలవార్తలను వింటారు. ఉద్యోగంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించగలవు. సాంఘిక కార్యక్రమాల్లో మీకు ముమ్ముందు ఉపయోగించ గల వ్యక్తులను కలుసుకొంటారు. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

**మకరం :** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు తలయెత్తడం వలన వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ఉద్యోగంలో ముఖ్యమైన నిర్ణయాలు వారాంతంలో చేయడం మంచిది. రావలసిన డబ్బు సమయానికి అందక యిబ్బంది కలుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాటివారితో మాటపట్టింపులకు దిగడం మంచిది కాదు.

**కుంభం :** ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయి గాని వారాంతానికి చికాకులు కలుగుతాయి. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో మీకు ముమ్ముందు ఉపయోగించగల వార్తలను వింటారు. కుటుంబ కార్యక్రమాలు సామాన్యంగా ఉంటాయి. కళాకార్యలకు మంచి సమయం.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**మీనం :** వృత్తి వ్యాపారాల్లో మీరు ఘనవిజయాల్ని యేమీ సాధించలేకపోయినా, అన్ని వ్యవహారాలూ అనుకొన్నట్లుగా నెరవేరడం వలన యీవారం సంతృప్తికరంగా ఉంటుంది. సాహసంతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభించగలవు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

—మహేష్ ●

# కమ్మని పరిమళముగల శ్రేష్ఠమైన టాల్క్

**పాండ్స్ డ్రీంఫ్లవర్ టాల్కం పౌడర్ వాడి రోజంతా నిలిచే చల్లదనం, తాజా హాయి పొందండి**




స్నానం చేసిన తరువాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు ఒంటినిండా జల్లుకొని చాలాసేపు నిలిచే తాజాతనాన్నీ, సువాసననూ పొందండి...అతి నాజూకైన సువాసనతో కూడిన యీ టాల్కం పౌడరు క్షణంలో చెమటను పీల్చి, ఏ వాతావరణంలోనైనా, రోజంతా ఆహ్లాద కరమైన చల్లదనాన్నీ, తాజాతనాన్నీ చేకూరుస్తుంది! ఇంటిల్లిపాదికీ యీ పౌడరు ఎంతో ఆదర్శమైనది.

చీసబ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

JWT-P-4596

సీరియల్ !



# ముగ్ధమందార

భూపతి

## 4

శ్శరీరం పులకించింది. ఎక్కడపుడితేనేం సింహాచలం మాణిక్యం—నేనో .... వనికి మాలిన దౌర్భాగ్యుణ్ణి. వోనామాలు చదువుకోవిద్యైనా ఎంత నీటిగా నిండుగా, చక్కగా నిష్కల్మషంగా నన్ను క్షమించింది. అదే మరొకతయితే—వాళ్ళవాళ్ళతో చెప్పి, నా జీవితానికి స్వస్తివాక్యం పలికించేదే— అలాంటిది తన కంఠంలో ప్రాణంపోయినా నా పేరు బయటికి రానివ్వనంది. పెళ్ళిచేసుకుని రమ్మంది. నాకు ఇంగ్లీషు చదివినపిల్ల కావా అంది. ఎంత ఇంగ్లీషు చదివినా పిల్లయినా సరే, సింహాచలం కాలి గోటికి సరిపోతుంది !

చదువుకూ, సంస్కారానికీ సంబంధం ఏమిటి ?

పదకొండింటికల్లా యింటికి తాళంవేసి తోలుపెట్టెలో పెట్టుకున్న బట్టలతో రామనాథంగారి యింటికి చేరి, "మా స్నేహితుడి పెళ్ళట. అర్జంటుగా వెళ్ళాల్సి వచ్చిందండి. వెళ్ళొస్తాను" అని బొంకి, సెలవు తీసుకొని, బెజవాడ చేరాను.

"అదేం—చెప్పా చేయక వచ్చేశావ్" అన్నారు నాన్నగారు నన్ను చూసి ఆశ్చర్యంతో. వంట్లో బాగుండలేదని, ఆవూరు పడలేదని, సెలవుపెట్టి వచ్చేశాననీ బొంకాను. నాన్నగారు నా మాటలు నమ్మారు. "ఓ నెల్లాళ్ళు సెలవు పెడితే సరి. మరో వూరుకు వాళ్ళే ట్రాన్స్‌ఫర్ చేస్తారు" అన్నారు.

"అలాగేనండి" అన్నాను. అదీ మంచి వూహే ! అమర్నాడే డిపార్టుమెంటు హెడ్‌కి నా సెలవు విషయం రాసి, డాక్టరు సర్టిఫికెట్ జతచేసి పంపాను.

* * *

పనిలేని వాతావరణంలో పదిహేను రోజులు చప్పి చెడి గడిపాను. ఒకరోజు నాన్నగారు నన్ను తన ఆఫీసు గదిలోకి పిల్చారు. ఆఫీసు గదిలోకి పిల్చారంటే ఏదో గొప్ప వ్యవహారం ఉండి ఉండాలి. చదువుతున్న పుస్తకం టేబులుమీద పడేసి, ఆయన గదికి వెళ్ళాను.

"కూర్చో" అన్నారు.

కూర్చున్నాను.

నాన్నగారు ఒక్కసారి నాకేసి చూసి, ఆనక టేబులుమీది అద్దంలో తన ప్రతిబింబం వైపు చూసుకుంటూ, "నీకు సంబంధం ఒకటి వచ్చింది. ఆ పిల్ల తండ్రి నాకు స్నేహితుడు. అమ్మాయి బియస్సీ ప్యాసయ్యింది. పిల్ల చాలా నెమ్మదస్తురాలు. నువ్వూ చూసే ఉంటావు ..... అమ్మాయి పేరు రాధ ...." నాన్నగారు చెప్పుకుపోతున్నారు. రాధని నేను ఎరుగుదును. పచ్చని బంగారుఛ్ఛాయలో చక్కని అవయవ సౌష్ఠవంతో మూర్తీభవించిన స్త్రీలా ఉంటుంది. కాని రాధకు కొంచెం అహంకారం ఎక్కువని నాకో అభిప్రాయం ఉండేది. ఆమె బియ్యస్సీ చదివే రోజుల్లో కాలేజీ వేళకి నేను తూముమీద ఒంటరిగా కూర్చుని ఆమెను చూసేవాణ్ణి. రెండు మూడుసార్లు మాట్లాడాలని ప్రయత్నించాను కూడా. కానీ, రాధకి నామీద మంచి అభిప్రాయం ఉన్నట్టు కనిపించేదికాదు. తల పక్కకు తిప్పుకుని వెళ్ళిపోయేది. అప్పటికీ వోసారి ఆమెకు ఎదురెళ్ళి "టయిమెంతయింది మేడమ్" అనడిగాను కనీసం ఆమె గొంతు వినాలన్న ఉద్దేశ్యంతో.

"విన్నిపాటి కయినంతే" అంది.

గొంతు బావుంది గానీ ఆ రకం సమాధానం ఎదురుచూడక పోడంవల్ల ఉలిక్కిపడి, తేరుకునేలోగా ఆమె విజయగర్వంతో వెళ్ళిపోయింది.

"ఏమి ఆలోచిస్తున్నావ్" అన్నారు నాన్నగారు నా వాలకం చూసి. "ఏంలేదు" అన్నాను పేపరు వెయిట్‌ని గిరగిర తిప్పుతూ. "నువ్వెవర్నయినా ప్రేమించావా ఒకవేళ, అలాంటి దేమైనా ఉంటే చెప్పు. నాకేమీ అభ్యంతరంలేదు" అన్నారు.

"లేదండి" అన్నాను. పూడిన గొంతుతో.

"అయితే వాళ్ళింటికి సాయంత్రం వెళ్దామా" అన్నారు. "అలాగేనండి" అని నేను లేచి, బయటపడ్డాను.

* * *

సింహాచలానికి వచ్చిన బట్టలు తొడుక్కున్నాను.

నాన్నగారూ, నేనూ బయల్దేరి వెళ్ళేసరికి, రాధ తండ్రి పరంధామయ్యగారు వాళ్ళ గడపలో సిద్ధంగా నిలబడి ఉన్నారు. మమ్మల్ని చూస్తూనే "రండి, రండి" అని ఆహ్వానించారు. లోపలకు వెళ్ళాము.

"ఈవిడ మా ఆవిడ" అంటూ వాళ్ళావిడను పరిచయంచేసి, అనక రాధని కూడా పరిచయం చేశారు. రాధ చేతులు జోడించి "నమస్కారం" అంది. నేను తలెత్తకుండా "నమస్కారం" అన్నాను. అంతా కూర్చున్నాము.

రాధ నా కెదురుగా ఉన్న సోఫాలో కూర్చుంది. బహుశా సన్నాసమాలు కట్టి ఉంటుంది. నాకు తలెత్తి ఆమెకేసి చూడ్డానికి భయంవేసింది. వచ్చేది నేనేనని ఆమెకు ముందు తెలిస్తే అసలు పెళ్ళిచూపులకు కూడా ఒప్పుకునేది కాదేమో!

నౌకర్లు కాఫీ, టిఫన్లు పెట్టారు. పరంధామయ్యగారు ఉన్నట్టుండి పెద్దగా నవ్వుతూ "పదార్థాలన్నీ హోటల్నుంచి తెప్పించాము. కొంపతీసి మా ఆవిడకు వంట రాదనుకునేరు. అదేంలేదు. కలికితే అలకదని సామెతుందట. అందుకని హోటలు పదార్థాలు తెప్పించాల్సి వచ్చింది" అన్నారు. అంతా ఆ నవ్వులో సమభాగాలు ఇచ్చాము.

లాంఛనం మార్కు ప్రశ్న లయ్యాక పరంధామయ్యగారి భార్య వెళ్ళిపోయింది. అనక నాన్నగారూ ఆయనా కూడా ఏదో మాట్లాడుకుంటున్నట్టు వెళ్ళిపోయారు. గదిలో నేనూ, రాధా మిగిలాము. నాకు ముచ్చెమటలు పోశాయి. నేను నెమ్మదిగా తలెత్తి ఆమెకేసి చూశాను. ఆమె కొంటెగా నాకేసి చూస్తున్నదల్లా చిరునవ్వుని పెదిమల మధ్య దాచుకుంటూ తల దించుకుంది. నా గుండె ఝల్లుమంది. రాధకూ నేనంటే ఇష్టమే!

మరొక్కసారి రాధకేసి చూశాను.

నీలం పట్టుచీర అదే రంగు రవిక, ఎడమ చేతికి రెండు నీలంగాజులు, కుడిచేతికి మేల్ వాచి.

"లేడీ అని బిరుదిచ్చారు నీకు గుర్తుందా" అన్నాను.

"ఇప్పుడు మాత్రం కాదన్నానా! లేదే." అంది.

"నేను వచ్చేదని మీ నాన్నగారితో చెప్పి నన్ను అవమానం చెయ్యడానికి పూనుకున్నా రనుకుంటాను."

"మీరే ననుకున్నారు."

"నాకు పెన్నిధి దొరికింది."

"మీకేకాదు నాకూ దొరికింది. వచ్చేది మీరే అని నాకు ముందే తెలుసు" అంది పైటచెంగు సరిచేసుకుంటూ నాకేసి చూసి. నే నామెకేసి ఆశ్చర్యంగా చూశాను. నిజంగా నా జీవడో అన్నట్టు మగవాళ్ళకన్నా ఆడవాళ్ళు రెట్టింపు తెలివి కలవారు. ఆనందంతో "థాంక్యూ" అన్నాను. పాశ్చాత్య విధానంగా కరచాలనం చెయ్యాలనిపించినా ఆరోగ్యమయిన కోర్కె కాదని ఊరుకున్నాను. ఆమె సిగ్గుతో తల వంచుకుంది.

"టయి మెంతయ్యింది మేడమ్" అన్నాను.

ఆమె కుడిచేతిని చాపి "చూసుకోండి మీరే" అంది.

"థ్యాంక్యూ" అన్నాను.

* * *

రాత్రి భోజనా లయ్యాక, నాన్నగారు నాతో, "వారికి మన సంబంధం ఇష్టమేనట. అమ్మాయి నీకు నచ్చితే ముహూర్తం ఏర్పాటు చేయిస్తాను" అన్నారు. నేను మహదానందంతో "అలాగే" అన్నాను.

నాకు మదరాసు ట్రాన్స్‌ఫర్ అయ్యింది! ఆనందం పాలు మరీ పట్టలేనంతయ్యింది! నాన్నగారికీ ఈ విషయం చెప్పేసరికి "బాగుంది. అయితే గోపాల్పూర్ వెళ్ళి సామాను తెచ్చేసుకో" అన్నారు. నా నెత్తి మీద ఆ ముక్క ఉరిమింది. ఇన్నాళ్ళుగా గోపాల్పూర్ విషయం మర్చిపోయాను.

"అలాగేనండి" అని రూముకు చేరాను.

ఒళ్ళంతా చెమటపోసింది. ఏ కారణంచేతయినా సింహాచలం నా పేరు బయట పెట్టి ఉంటే.... నా శరీరం భయంతో ముడుచుకుపోయింది. ఆనాడు అనుకున్న చావు ఈనాడు రాసిపెట్టిందేమో అనుకున్నాను. అసలు ఊరు వెళ్ళడం తప్పించుకుంటే బాగుణ్ణనుకున్నాను. కానీ, అది అయ్యేపని కాదు. నాన్నగారు నో రెండ్రోజు లాగి మళ్ళీ హెచ్చరిక చేయడంవల్ల తప్పనిసరిగా బయల్దేరాను. గోపాలపురం ఊళ్ళో అడుగు పెట్టేసరికి నా గుండె దడదడ లాడింది. ఇంటికి వెళ్ళే ధైర్యంలేక, సోమ్ము మేష్టారింటికి వెళ్ళాను. ఆయన నన్ను చూసి ఆశ్చర్యపోయి, "హ్వారే, ఇదేమిటోయ్ వెళ్ళిన వాడివి అదే పోత పోయావు?" అని అంతలోనే తప్పు సవరించుకుని, "నీ ఆరోగ్యము ఎలా ఉందిప్పుడు" అన్నారు. నా చర్యకి నో పూర్వాపరాలు క్లుప్తంగా ఆయనతో చెప్పి, నమ్మించి అనక నాకు అదీ అంతా పట్టు చెప్పి "మన వూరు విశేషాలేమిటి?" అన్నాను—'ఆ సంగతి' ఒకవేళ పొక్కిందేమో నన్న అనుమానంతో.

"విశేషా లేవున్నాయ్ బాబూ .... ఆ! ఒకే ఒక్క విశేషం ఉంది. మీ పనిమనిషి కూతురు లేదూ .... మీ ఇంటికి అప్పుడప్పుడు వొచ్చేది .... సింహాచలం .... అదెవడితోనో తిరిగి కడుపు తెచ్చుకుంది. వాళ్ళు పెద్ద పంచాయితీ పెట్టారు. నన్నూ, రామనాథం గారినీ పెద్దమనుష్యులుగా పెట్టారు. వాళ్ళు వాలికలు పీక్కుని చచ్చారే గానీ అది వాడి పేరు బయటపెట్ట లేదు. ఆ! నా మొహం. చెప్పడానికి మాత్రం తెలిస్తేగా, అసలే ఇది టూరిస్టు సెంటరు—పైగా వాళ్ళకి నీతేమిటి ? జాతేమిటి?...." అంటూ గలగల నవ్వాడు.

"అంతవెూ టపకండి" అంది.

కాస్సేపు మౌనంగా నిలబడ్డాము. తిరిగి సింహాచలమే అంది, "పొద్దున్న సామాను సర్దడానికి వస్తాము. అప్పుడే నేను మనం కలిసివుంటే ఎవరన్నా అనుమానిస్తారు" అంది.

"ఏడిశారు" అన్నాను నేను దాదాపు అరిచి నట్టు. సింహాచలం నా అమాయకత్వానికి నవ్వి, "సరే, ఇహ నేను వెళ్తాను. రేపు వస్తాం" అంది. నేను ఆవేశంతో సింహ చలాన్ని నా గుండెకు హత్తుకున్నాను. సింహాచలం నన్ను పెనవేసుకుపోయింది

* * *

ట్రైయిన్ పెట్టెలోంచి కనుమరుగయ్యే వరకూ తల బైటపెట్టి చూశాను. కళ్ళలో నిలచిన నీరును ట్రైటవెంగుతో వత్తుకుని వెళ్ళిపోతూండడం లీలగా కనిపించింది— నాకు. భారంగా నిట్టూర్చి బెజవాడ చేరాను.

గోపాలపురం నుంచి వచ్చిన మూడో నాడు నా మద్రాసు ప్రయాణం ఖాయమయ్యింది. వివాహం పై నెలలో ఖాయమయ్యింది. పరంధామయ్యగారితో, రాధతో నాన్నగారితోనూ చెప్పి మద్రాసు చేరి, కాలేజీలో చదివే రోజుల్లో నా రూము మేటు భాస్కరం అక్కడుండడంవల్ల తిన్నగా అతనింటికి వెళ్ళాను. భాస్కరం నన్ను చూసి పరమానంద పడ్డాడు. "ఏరా! పెళ్ళి చేసుకోవా" అని బ్రహ్మచారి మార్కు ప్రశ్న వేశాడు. నా పెళ్ళి ముహూర్తం వివరం చెప్పి, "మరి నీ కీ వంటరి తనం ఏవిటి ?" అన్నాను. భాస్కరం ఫెళ్ళున నవ్వి, "మా ఆవిడ పై నెల వస్తుంది. పై నెలంటే పై నెల కాదనుకో? రెండు మూడు నెల లవుతుంది. పుట్టింటి కెళ్ళింది." అన్నాడు.

"పిల్లలెంతమంది?" అన్నాను.

"పిల్లలా! ఇంతవరకూ లేర్రా! అందుకే వెళ్ళింది. ఇవాళో రేపో శుభవార్త రావాలి" అన్నాడు. అన్నాక "మనిద్దరం కలిసి మంచి పెద్దిల్లు తీసుకుందాం. మా ఆవిడ వచ్చేలోగా ఇల్లు చూడాలని చెప్పి మరీ వెళ్ళింది.




కండ్ల అందానికి రక్షణకు

దర్‌బార్ కాజల్

కాటుక

తయారుచేయువారు:

రాంబీర్ కంపెని, బొంబాయి-4.






పొదుపైన కాల్గేట్ బహుళార్థక టాల్క్‌లో చల్లని, పరిమళ సంపద

మనోహరమైన పరిమళము కలిగి.. ఆశ్చర్యము గొలిపే పొదుపైన ఒక ఉత్తమమైనటాల్క్: మీకు అద్భుతమైన చల్లని, సువాసనతో ఆహ్లాదకర మైనతాజాదనాన్ని రోజంతా ఇస్తుంది. ఇంటిల్లిపాదికీ, పసిపాపతో సహా ఎంతో ఉత్తమమైనది.

కాల్గేట్ ఆల్-పర్పస్ టాల్క్

CAPT. C. 3 TEL

కే. టి. కృష్ణమూర్తి ఆచార్యులుగారి



"మేల్ మాయిల్ మందు"

నల్లరంగు, ఎర్రరంగు పొడలు, పొక్కులు, గజ్జి, మరియు తెల్లపొడ వ్యాపించినందున ఏర్పడు వికారము పుట్టించు రణములు మొదలగు

దీర్ఘకాల చర్మరోగములకు ఉత్తమ నివారిణి

వివరములకు

సిద్ధ డాక్టర్ కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు

5/22, మేల్‌మాయిల్, (P. O.) N. A. Dt.



సువాసనలు వెదజల్లే, మీకు సొగసు సమకూర్చే పామొలీవ్ లవెండర్ టాల్క్

మీకు నచ్చే సువాసనలు మీ కోసం తిరిగి సృష్టించబడ్డాయి! ప్రపంచ సౌందర్య కేంద్రాలనుంచి. గతంలో సులభంగా దిగుమతి అయ్యే సువాసనల గురించి మీరు ఇక కలలు గంటూ కూర్చో నక్కర్లేదు. ఈ నాడు పామొలీవ్ లవండర్ టాల్కులో, దానితో కలిసిన సువాసనలలో మిమ్మల్ని ముంచెత్తుకో గలరు. పామొలీవ్ లవండర్‌ను వల్ల అంతా జల్లుకొని సొగసుగా వుండండి.

పామొలీవ్ లవెండర్ టాల్కుతో ఎప్పుడూ తాజాగా పరిమళ లావణ్యంగా వుండండి




ఇంకా, పామొలీవ్ టాల్కు డీలక్సు 17 మనోహరమైన సువాసనలు కలిగి ఉన్నది


మంధమందార

ఇద్దరం కలిసి టీ నగరంతా తిరిగి ఒక యిల్లు సంపాదించాము. వెరి మూడు గదులూ వచ్చాయి. అకౌంట్లో చేరిన మర్నాడే భాస్కరం తనకి వచ్చిన టెలిగ్రాం విప్పి చదువుకుని "మగపిల్లాడు" అని ఎగిరి గంతేశాడు.

మగపిల్లాడు.

నా శరీరం జివ్వుమంది.

భాస్కరం హోటలుకు తీసుకుపోయి వో పెద్ద పార్టీ యిచ్చి, అవాడే అత్తారూరు వెళ్ళిపోయాడు. భాస్కరం ఎక్కిన రైలు కదిలాక, నేను తిన్నగా బీచ్‌కి వెళ్ళాను. గుండె పిచకట్టి పోయింది. ఆలోచించలేక ఇంటికి వచ్చి పక్కమీద చేరాను. లోపల ఏదో ఆరాటం బయలుదేరింది. సింహాచలం ఫోటోని ఆల్బమ్‌లోంచి తీసి చూస్తూ నిద్రలోకి జారిపోయాను.

* * *

నాలుగోనాటికలా భాస్కరం వచ్చాడు. తన కొడుకుని గురించి, వాడి అందాన్ని గురించి, తెలివిని గురించి పూసదండగా చెప్పి పూదరకొట్టేశాడు. పురిటిగుడ్డు తనకేసి చూసి నవ్వాడని చెప్పాడు. పురిటిగుడ్డు మనకేసి నవ్వడం ఏంట్రా నీ చాదస్తం అంటే, కాదు పొమ్మన్నాడు. పుత్రోత్సాహాన్ని ఆపడం మంచిదికాదని వూరుకున్నాను.

నా పెళ్ళి దగ్గర పడింది.

అయిపోయింది.

పెళ్ళికి భాస్కరము గాక, ప్రేమ్ మోహన్, లత అంతా వచ్చారు. తతంగం అంతా అయ్యింది. ఆ నెల మంచిదికాదని పై నెల రాధను తీసుకువెళ్ళొచ్చని చెప్పారు. ఉస్సురుమంటూ మద్రాసు చేరాను. రివాజుగా ఆఫీసులో నా ఫ్రెండంతాసి వో పార్టీ తీసుకుని, పిసినారి అనే బిరుదిచ్చారు. థాంక్యూ అనుకున్నాను.

నెల గడిచింది.

రాధ రాలేదు. ఏవో కారణాలొచ్చాయి. పై నెల వచ్చేలోగా భాస్కరం భార్య, కొడుకుతో వచ్చింది. వారం తిరిగేసరికి భాస్కరం భార్య సుమతి నాకు ఆప్తురా

అయ్యింది. వోవాడు వాళ్ళింట్లో భోజనాలు చేస్తుంటే, "మా తమ్ముడు ఒకడుండే వాడు. వాడచ్చు నీ పోలికే .... నాలు గేళ్ళ క్రితం నాగార్జునసాగర్ వద్ద కృష్ణలో పడి కొట్టుకుపోయాడు.... నిన్ను చూస్తే మా తమ్ముణ్ణి చూసినట్టు ఉంది." అంది. ఆమె కళ్ళవెంట నీరు జలజల రాలింది.

ఆరోజునుంచి సుమతికి నేను తమ్ము ణ్ణయ్యాను. వాళ్ళ జంటను చూస్తుంటే వాళ్ళలాగే నేనూ నా జీవితాన్ని రూపొం దించుకోవాలనిపించేది.

* * *

ఉన్నట్టుండి వోవాడు రావాల్సిన టెలి గ్రాము వచ్చింది. తెల్లారుజామున అలా రము పెట్టుకుని లేచి పెళ్ళైనంత అందంగా ముస్తాబయ్యి, స్టేషనుకు పరుగెత్తాము. అప్పుడే వస్తున్న రైలుకు ఎదురు పరి గెత్తాను. పరస పెట్టెలన్నీ ముందున్నుంచి చివర వరకూ వెతికేశాను. రాధ కనబడ లేదు. మళ్ళీ వెనక్కూ వెతుక్కూ వస్తుంటే రాధ ప్లాట్‌ఫారంమీద నిలబడి, "పిలుస్తే పలక్కుండా అటు పరుగెత్తుతా లేవటిందాక" అంది. "పిల్చావా! నేను నీ కోసమే పరి గెత్తుతున్నా" అన్నాను. నా కళ్ళకు రాధ వెనక నిలబడున్న వాళ్ళమ్మ కాస్త లస్యంగా కనిపించింది. నా ముఖంలో మార్పు చూసి రాధ కళ్ళతో నవ్వు వెక్కిరించింది. తప్పనిసరిగా ముఖానికి ఆనందం పులుము కుని, ఆవిణ్ణి కూడా కుశలప్రశ్నలు వేశాను. సామాను పట్టించుకుని, టాక్సీలో పడి ఇంటికి చేరాము. భాస్కరం, సుమతి బయట నిలబడి ఉన్నారు. టాక్సీ దిగు తూనే వాళ్ళకు రాధ వాళ్ళమ్మను పరి చయం చేశాను. ఇంట్లోకి వెళ్ళేసరికి సుమతి ప్లేట్లల్లో టిఫిను పెట్టి మా ముందట్లోకి తెచ్చింది.

"అయ్యో! మీ కెందుకక్కయ్యా యీ శ్రమ! నాతోపాటే లేచి యివన్నీ చేశావా! హోటలునుంచి తెప్పించుకుందుం గదా" అన్నాను.

"ఫరవాలేదు లేవోయ్" అంది సుమతి.

(సశేషం)


పరిమళ

బ్రాహ్మీ హేర్ ఆయిల్

సున్నితముగా పరిమళం చేయబడిన ఈ ఆయుర్వేద హేర్ ఆయిల్ కుదురుకు చల్ల పరచి, ఉపశమన కలిగించును. క్రమముగా బ్రాహ్మి హేర్ ఆయిల్ వాడకం కుదురుకు కలుగు అలస టను తొలగించి, హాయిగా నిద్రపట్టించును, ఆరోగ్యమైన కురులు పెరుగు టకు తోడ్పడును.

బెంగాల్ కెమికల్

కలకత్తా బొంబాయి కాన్పూరు

నోవిన్

మరింత శక్తిమంతమైన బాధానివారిణి మాత్రమేగాక మరింత సురక్షితమైనది కూడా!

తలనొప్పి, గుండెజబ్బు నొప్పులు, ఇంకా అనేక ఇతర రకాల కండరాల బాధలను త్వరితంగా నోవిన్ నివారించగలదు. అధునాతనమైన, తేలికగా బాధలకు వెసులుబాటుగా వుండేటట్టు ట్యూబ్‌లో నోవిన్ వున్నందున, అంతా అయిపోయేవరకు దాని శక్తి తగ్గకుండా వుండడమేగాక, పాడుపోం అటవస్తుంది.

నోవిన్ తో బాధపోయిందనండి

అది శక్తిమంతమైనది

కండరాలనొప్పా? వాడండి

ఐయోడిమా ఆయింట్‌మెంట్

త్వరగానే బాధ తొలగుతుంది · మరకలుండవు · మంటలేకుండా

ది కలకత్తా కెమికల్ కం. లి.

కలకత్తా - 29

CLC-6A TEL

నేడే చూడండి!





శ్రీ శంభు ఫిలింస్ వా॥

శ్రీకాకుళ

# ఆంధ్ర మహావిష్ణు కథ

నిర్మాత: దగ్గుబాటి లక్ష్మీనారాయణ చౌదరి

దర్శకత్వం: ఏ.కె. శేఖర్



స్వయంగా క్షత్రియులని, భారతీయులని వ్యవహరింపబడుతున్నా, వారు తమ పూర్వీకుల శౌర్యాన్నీ, క్రమాన్నీ పాటించేవారు. అనకనే వారు తక్కినవా రందరితో వేరు పడ్డారు.

సుధీరుని మాట నిజమైంది. చిరు జడలిక యింకా తగ్గనేలేదు.

ఆమ్రపాలికి పరమ మిత్రుడైన సుధీరుని బాణం వచ్చి చిరంజీవికి సమీపమందే ఉన్న గులాబి మొక్కలోకి దూరింది. చిరంజీవి ప్రసన్నుడై వెనక్కి తిరగ్గానే రెండో బాణం వచ్చి పడింది. తరువాత ధనువు, అమ్ములపొది వచ్చి పడ్డాయి. ఆ తరువాత సుధీరుని ముకుటం, దానితో సుధీరుని శరీరమంతా చిరంజీవి కాళ్ళ యెదుట పడ్డాయి.

అతి బలశాలి ఒకడు చేతులు నలుపుతూ, పళ్ళు పటపట కొరుకుతూ దూరంగా నిల్చుండడం చిరంజీవి విస్ఫారిత నేత్రాలతో చూడసాగాడు. చిరంజీవి పడచివచ్చి సుధీరుణ్ణి చూచాడు.

అవమానితుడైన సుధీరుడు మరల భవనంవైపు పారిపోయి యుండేవాడు. కాని చిరంజీవి తన మిత్రుని సాహసం బూడిద పాలవడానికిష్టపడలేదు. దూరంగా నిలబడ్డ రాక్షసదాసు బలం నిమిషంలో గుర్తించి కొంచెమైనా ఆలస్యం చేయకుండా ముకుటం, ధనుర్బాణాలతోపాటు అతడు సుధీరుణ్ణి అవతలకు తీసుకొని పోయాడు. శరీరపుష్టిలోనూ, చతురతలోనూ దాసు సుధీరుని కంటె విశిష్టత కలవా డన్నది మాత్రం నిజం. లేకపోతే...

'లేకపోతే ఏం చేసి యుండేవాడు?' అని చిరంజీవి కష్టపడి సుధీరుణ్ని రథంపై పడవేసి సంథాగారానికి తీసుకొనిపోతూ అడిగాడు.

'ఏమిచేసి ఉండేవాడా ?' అని సుధీరుడు ఆగ్రహంతో బాణం సవరిస్తూ అన్నాడు.

'అవునవును. ఏమిచేసి ఉండేవాడు? పర్వతకాయుడైన ఆ గాంధారదేశపు ద్వారపాలకుడు నిన్ను తన వక్షంతో పిండిచేసి లొట్టిచేసి ఉండేవాడు! ఆమ్రపాలి వినీత

## ఆమ్రపాలి

(12వ పేజీ తరువాయి)

ప్రియు డొకడు ఆ దాసుచేతి దెబ్బలు తిని వచ్చాడు. ఇది చూడ్డం నా కెంతమాత్రం యిష్టంలేదు.'

'బాణాలు నా దగ్గరే ఉన్నాయి. నా దగ్గరకు వచ్చేలోపలే వాణ్ణి స్వర్గంలో ఉన్న వాని పూర్వుల దగ్గరకు పంపిఉండేవాణ్ణి.'

'మళ్ళీ అదే పొరపాటా! నువ్వు అతణ్ణి చంపుతావే అనుకో. ఆమ్రపాలి తండ్రి మహానాముడూ, లిచ్ఛవీయ నాయకులూ 'ప్రవేణి పుస్తకం' చేతితో పట్టుకొని కూర్చుంటారు. నిన్ను సంథాగారానికి యీడ్చుకొని పోతారు. అనేకమంది కూర వీరుల నడుమ, ప్రేమించడానికి వెడుతున్న నీమీద దొంగతనం చేశావనే దోషం కూడా ఆరోపించబడుతుంది. ప్రజలు నవ్వడం ఆరంభిస్తారు. నిన్ను 'ఒక దాసుణ్ణి చంపిన పంద' అంటారు. బలవంతుడైన లిచ్ఛవీయ యువకుడు ఒకడు ఒక యుద్ధమైనా చేయకుండా, ఒక స్త్రీ నుండైనా ప్రేమ పొందకుండా దేశ హిత కార్యం ఒక్కటైనా చేయకుండా పందలా చస్తున్నాడు. ఇంతేగాదు, మన గ్రామంలోని లిచ్ఛవీయ యువకుల బుద్ధిబలం, శక్తి కళంకిత మవుతాయి. కాబట్టి నిన్ను మిత్రుణ్ణిగా ఎంచి యిలాంటి పాపన్నుండి నిన్ను కాపాడడం నా కర్తవ్యం'.

అనుకోకుండానే సుధీరుడు నవ్వి "మాటల్లో నీతో ఎప్పుడూ ఓడిపోతాను!" అన్నాడు.

'ఛీ, నిను. ఆ బాలిక లభించదు. కాని ఆవిడ లభిస్తే ఏం చేస్తావు, సుధీరా ?'

'ఆమ్రపాలి యింకెక్కడ ?' సుధీరుడు కొంచెం నిరాశతో 'ఆమె తన పూరు నందీగ్రామం వెళ్ళింది.' అన్నాడు. చిరంజీవి సుధీరుని నిరాశాభావం గ్రహించాడు. అతని ముఖంలో ఒక మందస్మితరేఖ మెరిసింది. అకస్మాత్తుగా ఒక కొరడా చప్పుడు వినిపించింది. అశ్వములు ఉరికాయి. రథగమనం హెచ్చింది. సుధీరుడు ఉలికిపడి చిరంజీవి వైపు చూశాడు.

'చిరంజీవి, [illegible] ?'

'నందీగ్రామం పోవాలి' అని చిరంజీవి అన్నాడు.

'సంథాగారంలోని సభ సమాప్త మవడానికి ముందే నే నిక్కడకు రావాలి.'

* * *

'లిచ్ఛవీయులారా' అను రణహుంకారం వలె వాయుకంపనంచేసే సంబోధనాన్ని అందరూ విన్నారు. లిచ్ఛవీయులతో నిండియున్న వైశాలీ సంథాగారం ఒక్క క్షణం పాటు మాటలతోటే శస్త్రనాదంతోటే ప్రతిధ్వనించింది. తరువాత అక్కడ ప్రశాంతి స్థిరపడింది. సభలో ఆసీనుడైన ప్రతిరాజా సామంతుడూ, సర్వశ్రేష్ఠుడూ, ప్రతిభావంతుడూ, లిచ్ఛవి గణనాయకుడూ అయిన మహానామునివైపు దృష్టి సారించారు. అందులో ఉన్న ప్రతి ప్రాణీ సింహగర్జన మేల్కొల్పగలిగినట్లు వృద్ధ మహానాముని ప్రచండకంఠరవం ప్రతి లిచ్ఛవీయుని హృదయాన్ని చైతన్యవంతం చేయుగలుగుతుంది.

తీక్షణదృష్టి బరపి మహానాముడన్నాడు.

'లిచ్ఛవీయులారా, వజ్జిభూమి లిచ్ఛవీయ స్వతంత్రదేశం. అది ఏదో ఒక లిచ్ఛవీయుడికి చెందిందికాదు. ప్రతి లిచ్ఛవీయుడూ దానికి పుత్రుడు, రక్షకుడు. వైశాలిలో లిచ్ఛవీయుల సింహనాదం వినిపించునంతవరకూ, మనలో సమత, ఐకమత్యం ఉన్నంతవరకూ మగధదేశపు యువరాజైన బింబిసారునివంటి వందలకొలదీ బింబిసారులు వైశాలిలోని మాది మోసి పంత భూమినైనా స్పృశించలేదు. మాగధీయులు తమకు అభీష్టమైన ఆక్రమణలుచేసి మనకు శత్రువులయ్యారు. వాళ్ళ యువరాజా బింబిసారుడు కూడా మనకు శత్రువే!'

'బింబిసారుడు మనకు శత్రువు!' అను ఒకే ధ్వని తక్షణం నలు మూలలనుంచీ వెలువడింది.

'గర్భశత్రువు' అని ఒక యువకుడు ఆలోపుగానే బిగ్గరగా అరచాడు. ఆ అరపు వచ్చినవైపే అందరిదృష్టి సాగింది. అతడు చిరంజీవి. అతడు ఆవేశ పూరితుడై అలా

అరిచాడు. కోశలరాజు, అతని తండ్రి కూడా రెండేండ్ల క్రితం ఒక మాగధీయుని చేతుల్లో మడిసాడు. ఒక్కక్షణం కాలం ప్రశాంతంగావున్న తరువాత చుట్టుప్రక్కల నున్న యువకులందరూ ఒక్కసారిగా 'బింబిసారుడు మాకు గర్భశత్రువు' అని గట్టిగా అరిచారు.

అనుభవంగల వృద్ధులు ఆ యువకుల్ని సమర్థించారు. వృద్ధుడైన మహానాముడు కూడా గాంభీర్యం విడిచిపెట్టి 'గర్భశత్రువు' అని గొణిగాడు. తరువాత సభాపతి మహానాముడు నిలబడి తన కెదురుగా సంధాగారానికి మధ్యభాగంలో స్వర్ణఖచిత సింహాసనంమీద జరిగల అందమైన చిన్నని పట్టుబట్టలో ఉంచబడిన తాటాకుల పై హస్తం ఉంచి గాంభీర్యంతో ఇలా అన్నాడు—'సభాసదులారా, పవిత్ర 'ప్రవేణి పుస్తకం' ఆదేశం ప్రకారం మన దేశాన్ని జయించడానికి ఉద్యమించు మాగధీయులతో ఎట్టి సంబంధం పెట్టుకోమని నేడు మనం ప్రతిజ్ఞ చేద్దాము. సభాసదులందరికీ ఇది సమ్మతమేనా? రాజుగాని, సామంతుడుగాని, మహారాజుగాని ఎవరి కెట్టి అభ్యంతరమున్నా సభ యెదుట చెప్పండి!'

మహానాముడు మాట్లాడిన తరువాత సంధాగారంలో ఎప్పటివలె ప్రశాంతి స్థిరపడింది. కొంతసేపయిన తరువాత అతడు నలువైపులా దృష్టి సారించి ఆ ప్రతిజ్ఞను మరొకసారి అన్నాడు. కాని అందరూ శాంతంగా ఉన్నారు. మూడవసారి ఆ ప్రతిజ్ఞను ఉచ్చరించాడు. ఒక్కడూ కిమ్మన లేదు. అందరూ ప్రశాంతంగా ఉండడం చూచి తుద కతడు ఇలా అన్నాడు—'సభ్యులారా, ఈ ప్రతిన మీ అందరికీ అంగీకారమని మీ మౌనం వల్ల తెలుస్తోంది. నేటినుండి మాగధీయులతోనే సంబంధం పెట్టుకొనే లిచ్ఛవీయుడు దేశద్రోహిగా ఎంచబడతాడని లిచ్ఛవీయుల కోరికను అనుసరించి నే నాజ్ఞాపిస్తున్నాను!' ఈ చివరి మాటలు పూర్తికాగానే సభాభవనంలో ఆకాశాన్ని భేదించే తుముల నాదం పుట్టింది — 'మాగధీయులతో సంసర్గం ఉన్న లిచ్ఛవీయుడు దేశద్రోహి!'

దేశద్రోహం—ముఖ్యంగా లిచ్ఛవీయులలో ఘోరనేరంగా పరిగణింపబడేది. ఆ నేరం నివారింపరానిది. ప్రజలు దేశద్రోహిముఖం మీద ఉమ్మేస్తారు. రాళ్ళు రువ్వుతారు. అతని కుటుంబంలోని వాళ్ళు జీవన్మృతులు. చిన్న పిల్లలకు నైతికమైన వెరపు కలిగించటానికిగాని, యువకులలో తిరస్కారభావం కనుపడింపచేయడానికిగాని దేశద్రోహి పేరు హేయంగా ఉదాహృతమయ్యేది. దేశద్రోహి బంధువులు ఆత్మహత్య చేసుకోవడమో లేక స్వదేశం విడిచి పారిపోవడమో తటస్థించేది......ఆ క్షణంనుండి లిచ్ఛవీయ సంధాగారంచేత చేయబడిన ఆ నిర్ణయం దేశమంతటికీ అనుల్లంఘనీయమైన శాసనమయింది. సభముగిసింది.

సంధాగారంనుండి వెలుపలికి వచ్చిన తరువాత ప్రతి వ్యక్తీ మహానాముణ్ణి ప్రశంసిస్తున్నాడు. అతని ప్రభావం అంత రిప్పైబడింది. వైశాలీ దేశంలో ఏ ఘన కార్యమైనా అతని ప్రోత్సాహం, అనుమతి పొంది జరుగుతూండేది. సంధాగారం నుండి వెలువడిన అతని గర్జన దేశం నలుమూలలా ప్రతిధ్వనిస్తుండేది. అతని ముఖం ఎప్పుడూ కాంతియుతమైన మందహాసంతో వికసించి ఉండేది. అతడు ఎన్నడూ బిగ్గరగా మాట్లాడడు. కాని మాట్లాడేడో, హుంకరించేవాడు. ఆ సమయంలో అతని ఎదుట నిలవడానికి ఎటువంటి లిచ్ఛవీయునికైనా సాహస ముండేదికాదు. అందరూ విని పూరకుండే వారు. ఏదో కారణంచేత అతని హృదయం అత్యంత సంక్షోభం పొందినప్పుడో, లేక ఏదైనా అన్యాయం అతనికి అసహ్యమైనప్పుడో అతను తీవ్రంగా మాట్లాడవలసి వచ్చేది.

నేడు సభ జరగడానికి ఒక అసాధారణమైన కారణముంది. చిరకాలంనుండీ తమ పొరుగునఉన్న మాగధీయులతో లిచ్ఛవీయులకు అంతరంగికమైన విరోధముంది. స్వాతంత్ర్యప్రియులైన లిచ్ఛవీయులు సామ్రాజ్యవాదులైన మాగధీయులతో ప్రతి విషయంలోనూ కలహిస్తూండేవారు. శక్తి శౌర్య, పరాక్రమాలతో మదించిన మాగధీయరాజ పురుషుల కన్నులు దుర్జయులు, అవిధేయులు అయిన ఆ లిచ్ఛవీయుల స్వతంత్రతా సంపత్తియందు పొదుకొన్నాయి. కాని, దానితోపాటు వాళ్ళు లిచ్ఛవీయుల గుణ గణాలను చక్కగా గుర్తించి ఉండకపోలేదు. మాగధీయుల ప్రలోభనాలను ఎన్నింటినో లిచ్ఛవీయులు తిరస్కరించారు. ఉదారులు, బలశాలులు అగు

వీడేనండీ మా టైపిస్టు!



# ఆమ్రపాలి

లిచ్ఛవీయులు మాగధీయు అపారమైన ధనాన్ని, సుఖ సాధనాలను తిరస్కరించి వేశారు. మాగధీయుల్ని విరోధులుగా భావించక పోయినా, వారితో బాంధవ్యం ఏర్పరచుకోడానికి వారు సందేహిస్తూండేవారు. మొదటినుండీ రెండురాజ్యాలకూ సంబంధం ఏర్పడి ఉన్నా, క్రమంగా వాళ్లల్లో కలహ కారణాలలైన విషయాలు పుడుతూ ఉన్నాయి. సార్వభౌమాధికారం పొందాలన్న మాగధీయుల మహాకాంక్ష లిచ్ఛవీయుల స్వాతంత్ర్యానికి అడ్డుపడసాగింది. కాబట్టి వాళ్లు జాగ్రత్తగా ప్రవర్తించడం మొదలు పెట్టారు. శాశ్వతమైన నిర్ణయం చేయడానికి లిచ్ఛవీయ నాయకులందరూ చాలా శ్రద్ధతో వైశాలీ నగర సంధాగారంలో సమావేశమై మాగధీయులను శత్రువులుగా పరిగణించడానికి నిశ్చయించారు. సంధాగారానికి వెలుపల ఎన్నో రథాలు నిలిచిఉన్నాయి. సభాసదులు బయటకువచ్చి తమ అభిప్రాయాలను ప్రకటిస్తున్నారు. ఒకరాజ ప్రతినిధి తనతో వస్తున్న చిరంజీవితో 'మహానాముని వంటి దేశభక్తుణ్ణి పొందడం దుర్లభం' అన్నాడు.

'ఈతనిమీద వైశాలిలోని ప్రతి యువకుడూ తన ప్రాణాలను అర్పించడానికి సిద్ధంగా ఉన్నాడు' అని చిరంజీవి అతని మాటను సమర్థించాడు.

'ఈతని పేరుమీదనా?' అని సమీపంనుండే ఎవరిదో గంభీరమైన కంఠరవం వినిపించింది. ఇద్దరూ అదరిపడి ఆ వైపు తిరిగి అభయరాజు అక్కడ నిలబడ్డం చూచారు. వైశాలిలో అతడొక్కడే కూట నీతిలో సాటిలేని మేటి. అతనికి ఏభై యేళ్లు పైబడ్డాయి. రాజకీయపు ఎత్తుగడలందు అభయరాజు సాటిలేని ఆటగాడు. పెదవులతో కాకుండా నేత్రాలతో అతడు అధికంగా మాట్లాడుతాడు. రహస్య పూరితమైన మందహాసంతో ఒప్పు అతని ముఖం, అత్యంత ధైర్యశాలిని కూడ కలచివేయ గలదు. వాదంలో అతడు అజేయుడు.

రాజప్రతినిధి ప్రౌఢుడు. అభయరాజు అతడు విస్మితుడవడంచూచి నవ్వాడు. ఏమీ అనకుండానే రాజప్రతినిధి నడవసాగాడు. అతడు అభయుని గూఢ భావం గ్రహించాడు. అప్పుడు అభయుడు చిరంజీవివైపు చూచి, 'చిరంజీవీ, నీవు నన్నెరుగవు. కాని, నేను స్వర్గస్థుడైన నీతండ్రిని బాగా ఎరుగుదును' అన్నాడు.

'అవునండి, నా తండ్రి మిమ్మల్నిగురించి ఎన్నిసార్లో చెప్పారు!'

"హాహా! నీవు నన్ను గుర్తించావన్న మాట. వైశాలికి రావడం నీ కిదిమొదటి సారేకదూ? మంచిది. నాతోరా!' కొంచెం ఆగి, సాభిప్రాయంగా మందహాసంచేసి అభయుడు మళ్ళీ యిలా అనసాగాడు—

'నిన్ను మహానాముని యింటికి కూడా తీసుకుపోతాను.'

చిరంజీవి అదరిపడి 'అక్కడికెందుకూ?' అని అడిగాడు.

'ప్రతి యువకుడూ మహానాముని భక్తుడే, నీవిది ఎరగవూ?'

చిరంజీవికి కొంచెం సంకోచం కలిగింది. కొంచెం ఆగి అతడు గంభీరంగాఇలాఅన్నాడు.

'మహాశయా, నేనక్కడనుండే వచ్చాను. మీరు అంగీకరిస్తే నా స్నేహితు నొకణ్ణి తమ దగ్గరకు తీసికొని వస్తాను. అతడు వైశాలినీ, మహానాముణ్ణీ కూడా చూడాలి'

'మంచిది. అలాగే. అత డెక్కడున్నాడు?'

'ఇప్పుడే యిక్కడకు వస్తాడు. గణనాయకుడైన మహానాముణ్ణి చూచే అమితమైన కోరిక అతనికుంది.'

చిరంజీవి మాటల్లో గర్భితమై ఉన్న భావాన్ని గ్రహించడానికి కుశాగ్రబుద్ధియైన అభయుడి కెంతో కాలం పట్టలేదు. ఆమ్రపాలి వెనకాల పిచ్చివారిలా తిరిగేవాళ్లల్లో మరొకడు ఆమె యింటికి రాబోతున్నాడు. అతడు అడ్డు పెట్టలేదు.

(సశేషం)


లలితాయుర్వేదమున కేన్సరు చికిత్స

"నా స్నేహితుని భార్య 3 ఏండ్లనుండి ప్రేగులలో కేన్సరు వ్రణముతో భయంకరమగు బాధలతో 6 నెలలనుండి లేవలేని పరిస్థితిలో శ్రీ ఖండవల్లి రాజారావుగారి లలితాయుర్వేద వైద్యము ప్రారంభించిన రెండవ దినముననే బాధలు చాలవరకు తగ్గిపోయినవి. రెండు నెలల లోపుగానే ఇప్పుడు ఆమె సుఖముగా తిరుగుచున్నది. ఆమెకు కేన్సరు రోగము పూర్తి కుదిరికకు చాలదగ్గరకు వచ్చినదన్న నిశ్చయమునకు వచ్చినాము. (సం) సయ్యద్ సికందర్ అజామ్,

సేల్సు అండ్ పర్చేజ్ ఆఫీసరు, నిజాం షుగర్ ఫ్యాక్టరీ లి॥ హైదరాబాదు."

లలితాయుర్వేదము

కేన్సరుకి యింతవరకు కాల్చడము, కోయడము తప్ప చికిత్స లేదు. లలితాయుర్వేదమున కేన్సరుకే గాక ఇతరముగా అసాధ్యములైన వ్యాధులకన్నిటికి శీఘ్రతరము నిశ్చయములు నగు చికిత్సయున్నది. ఒక్క కేన్సరు వ్యాధిచికిత్స చాలు ప్రపంచమంతట లలితాయుర్వేదము శీఘ్రముగా వ్యాపించుననుటకు నిదర్శనము.

ఖండవల్లి రాజారావు, 8-1-328, శివాజీ నగర్ (ఇందిరాపార్కు), సికిందరాబాదు.

వైద్యము ఉదయం 8 నుండి 11 వరకు.





శుభ వార్త: కడుపులో నొప్పి, తలనొప్పి, చర్మవ్యాధులు, సంధ్యవ్యాధులకు ప్రత్యేక చికిత్స. నాడీ పరీక్షతో వ్యాధిని నిర్ణయింతురు సర్వ మొండివ్యాధులకు మా వైద్యశాల ప్రధాన వైద్యులు డా॥ ఎస్. ఎస్. రావుగారు ఈ క్రింది విధముగా బస చేయుదురు. ఉ॥ 7 గం॥ నుండి సా॥ 3 గం॥ వరకు సంప్రదించవచ్చును. పరీక్ష ఫీజు : రు. 5/- మందు ఖరీదు వేరు. 1 వ తేదీ: కర్నూలు: ఉడ్‌లాండ్సు హోటల్. 2 వ తేదీ: నంద్యాల: పేలస్ హోటల్. 3 వ తేది అదోని పేలస్ హోటల్. 4 వ తేదీ: గుంతకల్లు: బృందావన్ లాడ్జి. 5, 6 తేదీలు: బళ్లారి: గార్డెన్ హోటల్. 7 వ తేదీ: అనంతపురం రాయల్ రిటైరింగ్ రూమ్స్, భద్రి బిల్డింగ్సు, బళ్లారి రోడ్. 8 వ తేదీ. మదనపల్లి: అశోక హోటల్. 9, 10 తేదీలు. బెంగుళూరు: మద్రాసు ఉడ్‌లాండ్సు హోటల్, సంపెంగ టాంక్‌రోడ్. 11 వ తేదీ చిత్తూరు. ఓరియంటల్ లాడ్జి. 12 వ తేదీ: కడప: అయ్యర్ హోటల్. 13 వ తేదీ: తిరుపతి: బాలాజీ లాడ్జి. 14&15 తేదులు మద్రాసు: హోటల్ హరినివాస్ (మోడరన్ కేఫ్), 4, తంబు చెట్టి వీధి. 16 వ తేదీ: నెల్లూరు: అజంతా హోటల్. 17 వ తేదీ: ఒంగోలు: కృష్ణాలాడ్జి, సంతపేట. 18 వ తేదీ: గుంటూరు: ఉడిపి శ్రీకృష్ణ లంచ్‌హోమ్, కృష్ణమహల్ ఎదురుగా. 19 వ తేదీనుండి: హెడ్డాఫీసు: హైదరాబాదు.

రావూస్ ప్రోడక్ట్సు, హైదరాబాద్-4 (H.O) బ్రాంచి: కర్నూలు, బుధవారపుపేట.

—SWASTIK

వావిలాల గోపాలకృష్ణయ్య

# విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ అవసరం

ఆధునిక పారిశ్రామిక జీవితంలో ఉక్కు ప్రధానపాత్ర వహించుతుంది. బంగారం కన్నా ఉక్కు పరిశ్రమ యే దేశంలో ఉచ్ఛస్థాయిలో ఉంటుందో ఆ దేశం పారిశ్రామిక జీవనంలో కీలకస్థానం వహించుతుంది.

మన మూడు ప్రణాళికలలో ఇంతవరకు పని చేస్తున్న ఉక్కు ఫ్యాక్టరీలలో తయారు అయ్యే ఉత్పత్తి భారతదేశ పారిశ్రామికాభివృద్ధికి సరిపోవడంలేదు. ఇప్పుడు పనిచేస్తున్న ఉక్కుఫ్యాక్టరీల ఉత్పత్తి కూడా సవ్యంగా సాగుతున్నట్లు కనపడడంలేదు. అందుకు 1964, 1965 సంవత్సరాల ఉత్పత్తి గమనించితే బోధపడుతుంది.

దుక్క ఇనుము
(టన్నులు)

| ఫ్యాక్టరీ | 1964 | 1965 |
|---|---|---|
| టాటా | 8342 | 32293 |
| ఇస్కో | 213519 | 217922 |
| రూర్కెలా | 73253 | 73517 |
| భిలాయి | 371787 | 452051 |
| దుర్గాపూర్ | 416243 | 321303 |
| ఒరిస్సా | 31147 | 32634 |
| వి.సి.యం. | 8058 | 4111 |
| మొత్తం | 1125349 | 1133831 |

ఒక్క భిలాయి తప్పితే తక్కినవి అంతగా అభివృద్ధి కనపరచడంలేదు. ఇది దుక్క ఇనుము పరిస్థితి అయితే తయారైన ఉక్కు వస్తువులు 1964 లో 43,43,017 టన్నులు, 1965 లో 45,28,718 టన్నులు ఉత్పత్తి చెయ్యబడ్డాయి. ఇది గాక 1965 లో 72,16,33,000 రూపాయల విలువచేసే 6,95,434 టన్నుల ఉక్కు పరికరాలు దిగుమతి చేసుకున్నాం.

బొకారోలో ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణానికి రష్యాతో ఒడంబడిక చేసుకోవడం జరిగింది. అది రాబోతుంది. అది 10 లక్షలనుండి 50 లక్షల టన్నులు ఉత్పత్తి చేయగలుగుతుంది. ఇది నిజంగా భారతదేశ అవసరానికి, విస్తరించనున్న పారిశ్రామిక అభివృద్ధికి చాలదు. అందుకే దస్తూర్ కంపెనీని పరిశీలన చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వం ఆదేశించింది. వారు సేలం యినుముకు సంబంధించి ఒక చిన్న ఫ్యాక్టరీ 50,000 టన్నులతోగా ఉత్పత్తి కాగలదానిని సూచించారు. అందుపై బ్రిటిషు అమెరికను కాన్సార్టియం (నిపుణులదళం) వారిని ఒక ఉక్కు ఫ్యాక్టరీకి సంబంధించి పరిశీలన చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వం కోరింది. వారు గోవా హాస్పేట్, సేలం, విశాఖపట్నం, బైలదిలా ప్రాంతాలు దర్శించారు. నివేదిక సమర్పించారు. విశాఖకు ప్రాధాన్యత యిచ్చారు.

ఆంధ్రుల ఆందోళన ప్రభావంగా శ్రీ సి. సుబ్రహ్మణ్యం ఉక్కుమంత్రిగా ఉన్నప్పుడు విశాఖపట్టణంలో రేవు ననుసరించి ఒక ఉక్కుఫ్యాక్టరీ నిర్మాణం జరుగుతుంది అని ప్రకటించారు. అటుపై శ్రీ సంజీవరెడ్డి ఉక్కుమంత్రి అయ్యారు. ఈలోగా పై నిపుణుల సంఘనివేదిక వచ్చింది. వారు విశాఖను రేవు రీత్యా ప్రముఖస్థానంయిచ్చి ప్రాధాన్యత చూపారు. తర్జన భర్జనలు సాగినవి. శ్రీ టి. టి. కృష్ణమాచారి బైలదిల్లాలో నిందుకు పెట్టకూడదనడంతో అక్కడ మధ్యప్రదేశ్ వారిచే ఆందోళనకు దోహదం కలిగించారు. సేలంలో అవసరమైతే రాష్ట్ర ప్రభుత్వమే నిర్మించుకుంటుందన్న వాదం లేవదీశారు. హాస్పేటకు ప్రాధాన్యత యివ్వకపోవడంతో చిన్నదైనా ఒకటి ఉండక తప్పదని ప్రారంభించారు. ఎవరి ప్రాంతాభివృద్ధిని వారు కోరడంలో అసహజమేమున్నది.

అయితే కేంద్రంలోవున్న పెద్దలు రాష్ట్రాల అండదండలు ఆశించి నిపుణుల సంఘ సిఫార్సులను కూడా నేలదన్ని తమ తంత్రాంగ రాజకీయాలకు వీటిని గురి చేయడం బాధగా ఉంటుంది.

బ్రిటిషు అమెరికన్ నిపుణుల సంఘం హాస్పేట, విశాఖలకు మాత్రమే ఉక్కు ఫ్యాక్టరీలను నిర్మించే అర్హత ఉన్నదని తెల్పి, అందులో విశాఖపట్టణంలో పెట్టడమే అవసరమని ఉత్తరోత్తరా బహుముఖవ్యాప్తికి అవసరం ఉందని, అవకాశం కూడా ఉందన్నీ, అసలు రేవు ప్రాతిపదికలపైనవే ఉక్కు ఫ్యాక్టరీలు నిర్మించడం ఈనాటి పద్ధతి అని హాస్పేటలో పెడితే విస్తరణకు అవకాశంలేక కుంచించుకు (రిజిడిటి) పోతుందని విశాఖపట్టణం అయితే బహువ్యాప్తికి (ఫ్లెక్సిబిలిటీ) అవకాశంవుందని, పెద్ద ఫ్యాక్టరీలు రేవు ప్రాంతాలలోనే నిర్మించబడుతున్నవని, అదే అవసరమని వాదించి అందుకే క్రింది ఉదాహరణలు చూపారు.

## రేవు కేంద్రాలలో ఉక్కుఫ్యాక్టరీలు

| దేశం | రేవు | ఉత్పత్తి టన్నులు |
|---|---|---|
| బెల్జియం | 1 గెంటు | 18,00,000 |
| ఫ్రాన్సు | 2 డన్‌కర్క్ | 15,00,000 |
| ఇటలీ | 3 టారంటో | 20,00,000 |
| జపాన్ | 4 హొరిహోటా | 22,20,000 |
| | 5 యవత | 46,00,000 |
| | 6 చిబ | 37,00,000 |
| | 7 కీహానవే | 12,40,000 |
| బ్రిటను | 8 మ్యాపోర్టు | 26,00,000 |
| అమెరికా | 9 ఫెయిర్‌లెస్ | 27,00,000 |
| ఇండియా | 10 విశాఖపట్టణం | 11,00,000 నుండి 50,00,000 |

ఈవిధంగా గమనిస్తే ప్రపంచంలో విశాఖరేవువద్ద నిర్మించే ఉక్కు ఫ్యాక్టరీ బహుళవ్యాప్తికి అవకాశం, ప్రపంచంలోనే ఒక ప్రముఖ ఉక్కు ఉత్పత్తి కేంద్రంగా వెలసే అవకాశం కనుపించుచున్నవి. ఈ విధంగా ఈ ఉక్కుఫ్యాక్టరీ విశాఖకు పోక తప్పని స్థితి కనుపించగానే దీనిని కాదనలేక, ముక్కలు చేయాలనే ఆలోచనలు పెద్దల

ప్రారంభించనిగాని విశాఖ ఉక్కుఫ్యాక్టరీ రాకపోతే రాజీనామా నిస్తానన్న శ్రీ సంజీవ రెడ్డి విశాఖలో దుక్కుఇనుము ఫ్యాక్టరీవస్తే చాలు లెమ్మన్నారు శ్రీ కామరాజు విశాఖ ఉక్కు ఫ్యాక్టరీతోబాటు దక్షిణాది రాష్ట్రాలైన మద్రాసు, మైసూరులకు కూడా సమమగు ఫ్యాక్టరీలు కలిగించాలన్నారు శ్రీ భక్తవత్సలం మద్రాసుకు కేంద్రం తప్పకుండా ఉక్కుఫ్యాక్టరీని ఘమ్తుందన్నారు శ్రీ నిజలింగప్ప హాస్పేటుకు తథ్యమన్నారు అయితే

## విశాఖ ఉక్కుఫ్యాక్టరీ

ఆంగ్లో అమెరికన్ నిపుణులుద్దేశించిన అయిదవ ఉక్కుఫ్యాక్టరీని చిన్న చిన్న ఫాక్టరీలుగా ముక్కలు చేయటానికి వీలులేదని కేంద్ర ప్రభుత్వం ఉక్కు శాఖామాత్యులు శ్రీ టి యస్ సింగ్ ప్రకటించడం ఈ సందర్భంలో హర్షించదగిన విషయం ఈ ఉక్కుఫ్యాక్టరీ దాదాపు 450 కోట్ల రూపాయల పెట్టుబడితో నిర్మింపబడుతుంది ప్రాథమికంగా 200 కోట్లతో ప్రారంభం అవుతుంది 11 లక్షల టన్నుల ఉత్పత్తితో ప్రారంభంఅయి ఏబదిలక్షల టన్నుల ఉత్పత్తివరకు విస్తరించుకుంది.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా వెనుకబడివుంది ఆంధ్రప్రదేశ్ నిర్మాణం నాడు ఆంధ్ర నాయకుల ఉదాసీనంవల్ల స్వచ్ఛమగు ఆంధ్రప్రదేశాన్ని మధ్యప్రదేశ్‌కు కోల్పోవడం జరిగింది అన్ని రాజకీయపార్టీలు బస్తరు ఆంధ్రులకే కోరారు కాని తీరా అవసరమయ్యేటప్పటికీ ఆందోళన వదిలివేశారు. అందువలన ఈనాడు ఈ విశాఖపట్నం ఉక్కుఫ్యాక్టరీకి కావలసిన ఇనుము—కాకిరాయి అంతా మధ్యప్రదేశ్‌లో ఉండిపోయినందున మధ్యప్రదేశ్ కాకిరాయివున్నచోటనే ఉక్కుఫ్యాక్టరీ నిర్మించాలనే పాతకాలపు సిద్ధాంతాన్ని లేవదీసింది.

ఆధునికయుగంలో ఏ అవసరాలు కావలెనన్నా, ముడిపదార్థాలు తెచ్చుకోవాలెనన్నా, చేర వేయవలెనన్నా, వివిధ దేశాలనుండి తెచ్చుకోవల్సిన అవసరం వచ్చినా తెచ్చుకొనుటకు రేవు కేంద్రము సులభమయింది నౌక అయింది అదే జపాను అవలంబిస్తున్నది. అందుకే మన బైలదిల్ల కాకిరాయి గుత్తకు కొని తీసికొనిపోతున్నది తయారైన వస్తువులు రవాణా చేయవలెనన్నా రేవు కేంద్రమే సాధ్యము. నౌక అందువల్ల అన్నివిధాల విశాఖ రేవు ఉక్కుఫ్యాక్టరీకి తగివుంది అందుకు తగిన ఆందోళన చేసి సాధించుకోవలసివుంది ఈ ఫ్యాక్టరీస్థల నిర్ణయం చేయుటకు 10వ తేదీ లోగా అన్ని వివరాలు పూర్తి చేయువలసిందిగా శ్రీ టి యస్. సింగు తదధికారులను కోరారు ఆంధ్రప్రదేశం అన్ని మూలలనుండి ఏకకంఠంతో విశాఖ ఉక్కుఫ్యాక్టరీ కోరవలసిందిగా సింహనాదం చేయాలి సాధించాలి. కేంద్రంలో ప్రధానికి, ఉక్కుమంత్రికి, మన ముఖ్యమంత్రికి తంతులు యివ్వాలి తీర్మానాలు పంపాలి, కార్డులు వ్రాయాలి ఆ విధంగా ఆందోళనచేసి ఉక్కుఫాక్టరీ సాధించి, ఆధునిక పారిశ్రామికాభ్యున్నతికి ఆంధ్ర ప్రదేశ్ కీలకస్థానం అయ్యేందుకు కృషి చెయ్యాలి. జై ఆంధ్ర ●



1966 'మిస్ ఇండియా'గా లక్మె కంపెనీవారు నెలకొల్పిన అందాల పోటీలో నెగ్గిన ఢిల్లీ అమ్మాయి మిస్ యాస్మిన్ దాజీ ఈమె అమెరికాలో జరిగే అంతర్జాతీయ పోటీలోకూడా పాల్గొంటుంది.



'మంగళసూత్రం'లో పద్మనాభం, గీతాంజలి

సమీక్ష

# మంగళసూత్రం

తమిళంలో ప్రసిద్ధుడయిన నిర్మాత, దర్శకుడు ఎ. కె. వేలన్ తెలుగులో నిర్మించిన అరుణాచలవారి "మంగళసూత్రం"లో సామాన్యుల్ని ఆకర్షించే అంశాలు చాలా ఉన్నాయి.

కొన్ని సంవత్సరాల క్రితం తమిళంలో తయారైన ఒక చిత్రాన్ని "మంగళసూత్రం" పేరిట మళ్ళీ తయారు చేశారు. ఈ చిత్రం మే నెల 19 వ తేదీన ఆంధ్రదేశంలోని ముఖ్య కేంద్రాలలో విడుదలయింది.

విధివశాత్తు ప్రేమించిన ప్రియురాలిని పొందలేకపోయిన కథానాయకుని కథ యిది.

పల్లెసీమలోవున్న పొలం వ్యవహారాలు చూసుకోటానికి అక్కడికి వెళ్ళిన రాజా అక్కడే ఒక అందమైన పల్లెపడుచును ఒక కోటమడుగు తీరానచూచి, మనసిచ్చి పుచ్చుకొంటాడు. పరిచయం చేసికోవాలని, ఒక ఇంటివారు కావాలని ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత, రాజా తిరిగి తన పూరొస్తాడు. పట్టణంలోని తండ్రికి చెప్పి తీరాకా "వీర భల్లూక మల్లయ్య" గారమ్మాయిని చేసికొంటాననగా, కుమారుని మాట కాదనలేక, ఆ తండ్రి పిల్లను చూడాలని వెళతాడు.

అక్కడవున్న "వీరభల్లూక మల్లయ్య"కు, తానూహించిన సంబంధానికి ఏమాత్రం పొత్తు కుదరకపోవటం, ఆయన హతాశుడై తన ఇంటికి చేరుకొని, కుమారునికి జరిగిన కథ వివరిస్తాడు.

ఈలోగా రాజా తల్లి అదే గ్రామానికివెళ్ళి, తన తమ్ముని కూతురిని, కుమారునికోసం ఖాయపరచుకొంటుంది. ఈ అమ్మాయి, రాజా ప్రేమించిన అమ్మాయి ఒకరేనని తెలియకపోవటంతో కథ మలుపుతిరిగింది.

మరోవైపు, దగ్గరి బంధువైన డాక్టర్ కమలకూడా రాజాపట్ల ఎనలేని మమకారాన్ని చూపుతూంటుంది. రాజాని పొందలేని పక్షంలో యీ జీవితంలో యిక పెళ్ళే వద్దని, తన సర్వస్వాన్ని తన 'నర్సింగ్ హోమ్'కే అంకితం చేస్తానని, తోటి మానవుల సేవాధర్మంలో నిమగ్నురాల నవుతానని డాక్టర్ కమల తరచు చెప్తుంటుంది.

ఇంతలో ఇంటినుంచి వచ్చిన రాజా తారు పెళ్ళిటంతో ఒకప్పుడు అణగారిపోయిన ఆశలు డాక్టర్ కమల హృదయంలో మళ్ళీ చిగుళ్ళు వేస్తాయి. కాని రాజా మనసంతా పల్లెటూరి పిల్ల 'కాంత' మీదనే ఉంటుంది.

ఖాయపరచుకొన్న ముహూర్తానికి ఎలాగైనా పెళ్ళి జరిపించాలనే నిశ్చయంతో కాంతకు, రాజా స్నేహితు లొకరికీ పెళ్ళి జరిపిస్తారేగాని, విధివశాత్తు పెళ్ళి కుమారుడు ప్రాణాలు కోల్పోతాడు. కాంతకు వైధవ్యమే మిగులుతుంది.

కొన్నాళ్ళ తరువాత ఇంటికొచ్చినరాజాకు తన ప్రియురాలిని ఆరూపంలో చూడటానికి ఖిన్నుడవుతాడు. సందర్భాన్ని పురస్కరించుకొని కథ రెండు మూడు మెలికలు తిరగటం, రాజా, కాంతలు డాక్టర్ కమల నర్సింగ్'హోమ్'కే చేరటం జరుగుతుంది. డాక్టర్ కమలకు, రాజాకు వివాహం జరిపి, తాను అసువులు బాస్తుంది కాంత.

ఈ కథలో ప్రధానమైన పాత్రలు మూడు. రాజా, కాంత, డాక్టర్ కమల. రాజాగా ఎన్. టి. రామారావు గంభీరమైన సన్నివేశాల్లో బాగా నటించారు. కాంతగా దేవిక పల్లెటూరి దృశ్యాల్లో బాగుంది. ఇక చిత్రం అంతా ఒక ఎత్తు, వాసంతి నటన ఒక ఎత్తు. సేవాధర్మంలో నిలిచి పోయిన డాక్టర్ కమలగా ఒకవైపు, నిజ జీవితంలో సుఖ సంతోషాలను పంచుకొనే ప్రియురాలిగా మరొకవైపు వాసంతి, ఎంతో వైవిధ్యంగల నటన ప్రదర్శించింది (వాసంతి నటన బెంగాల్‌లోని నటి మాధవీ ముఖర్జీ నటనను గుర్తుకు తెస్తున్నది అంటారొక స్నేహితులు). ఇక హాస్యపాత్రల్లో గీతాంజలి, పద్మనాభం తక్కువ హాస్యాన్ని అందించారు. తండ్రిగా రమణారెడ్డి, తల్లిగా హేమలత (తెలుగుతల్లి) ప్రదర్శించిన నటన బాగా ఆకర్షించాయి. రెండు, మూడు మంచి పాటలతోను, అందమైన ఛాయాగ్రహణంతోను, వేలన్‌గారి దర్శకత్వంతోను 'మంగళసూత్రం' ఒకసారి చూడటానికి అందంగా ఉంటుంది.

—ఒక సమీక్షకుడు

మహీధర నళినీమోహన్

# ప్రాణం అంటే ఏమిటి?

గుండుపిల్లి చంపేసిన పిల్లికూనకేసి శశి, విమ్మి జాలిగా చూస్తున్నారు.

"దొంగపిల్లి ఎందుకు చంపేసిందో?" అంది శశి.

"చంపటం అంటే?"— నాలుగేళ్ళ బాబుకి ఆమాట అర్థంకాలేదు.

"నువ్వు ఒకడివీ మధ్యని, పానకంలో పుడకలాగ" అని శశి తమ్ముడి మీద విసుక్కుంది.

"అలా విసుక్కుంటే ఏం లాభం? వాడి ప్రశ్నకి సమాధానం చెప్పుముందు." అని ఎగసందోశాడు సూర్యం బాబయ్య!

"చంపడం అంటే ..... చంపడమే" అంది శశి.

"ప్రాణం పోవడం అన్నమాట" విమ్మి వివరించింది.

"ప్రాణం అంటే?"—సూర్యం వదలి పెట్ట లేదు.

"ప్రాణం అంటే అదొక రకం గాలి. అది ఉంటే బతికి ఉంటారు. అదిపైకి పోతే చచ్చిపోతారు" అని విమ్మి తనకు తెలిసినంతలో సమాధానం ఇచ్చింది.

"ప్రాణం ఉన్నవాటికీ లేనివాటికీ తేడాఏమిటో?"—సూర్యం బాబయ్య వేసే ప్రశ్నలకు ఆ పిల్లలు తికమక పడిపోతూ ఉంటారు. ఒక్కొక్కప్పుడు అవి అర్థం లేని చొప్పదంటు ప్రశ్నలలాగ కనబడతాయి. ఏదో చమత్కారం లేనిదే బాబయ్య ఇలా ప్రశ్నలు వేయడని ఆపిల్లకు బాగా తెలుసు.

"ఓస్! ఈ ప్రశ్నకే సమాధానం చెప్పలేనా? ప్రాణంఉన్నవి కదులుతాయి, గాలి పీలుస్తాయి, తిండి తింటాయి మన పిల్లి పిల్లలలాగా— ప్రాణంలేని రాళ్ళూరప్పలూ ఆపని చెయ్యలేవు. అదీ తేడా!"

"ఆగాగు. అయితే కదులుతూ గాలి పీలుస్తూ తిండితినేది ఏదయినా సరే దానికి ప్రాణం ఉన్నట్లేనా?

సూర్యంబాబయ్య ప్రశ్నకు "ఆ!" అని దృఢంగా సమాధానమిచ్చిందివిమ్మి.

"అయితే మోటారుకారు కదులుతుంది పెట్రోలు దానికి తిండి. గాలిలేనిదే దాని ఇంజను కూడా పనిచెయ్యదు. ఒకవైపు నుంచి గాలిపీల్చుకుని, వెనుకనున్న గొట్టంలో నుంచి పనికిరాని గాలిని విడిచిపెడుతుంది. మరికారుకు ప్రాణం ఉన్నట్లేనా?"

విమ్మికి మాటతోచలేదు. కారుకి ప్రాణం లేదని నమ్మకమేగాని, ఈసవాళ్ళను ఎదుర్కోవడం ఎల్లాగ? అంతలో చటుక్కున సమాధానం తోచింది.

"పిల్లికి చెవులు వున్నాయి. వింటుంది. కళ్ళున్నాయి చూస్తుంది. నోరుంది అరుస్తుంది. ప్రాణంలేనివి ఈపనులు చెయ్యలేవు."—ఇప్పుడేమంటావు అన్నట్లు బాబయ్యకేసి టెక్కాయించి చూచింది విమ్మి.

సూర్యం కళ్ళు తళుక్కుమన్నాయి. "టెలిఫోను వింటుంది, మాట్లాడుతుంది కెమేరా మనకంటికన్నా బాగా చూస్తుంది. మరి వీటికికూడా ప్రాణం ఉందంటావా?"

విమ్మి నిర్విణ్ణఅయి పోయింది. శశి మనస్సు చురుగ్గా పనిచేసింది.

"మనం ఆలోచించగలం. లెక్కలు చెయ్యగలం. రకరకాల సంగతులుజ్ఞాపకం పెట్టుకోగలం. ఇది మంచిది ఇది చెడ్డదీ అని తర్కించగలం. ప్రాణంలేనివి ఈపనులు చెయ్యలేవు. అదీతేడా!" ఇక తన సమాధానానికి తిరుగులేదన్నట్లు చూచింది శశి.

"మరీ అంతదృఢంగా చెప్పెయ్యకు. నువ్వు చెప్పినపనులన్నీ చేయగలయంత్రాలు ఉన్నాయి! మనరేడియోలోపల గాజు బుడ్లు చూశారుకదూ, అటువంటివి వేల కొద్దీ ఉపయోగించి ఈయంత్రాలను తయారు చేశారు. అవిసెకనుకి పది లక్షల కూడికలు, తీసివేతలు చేయగలవు. పెద్ద పెద్ద గణిత శాస్త్రజ్ఞులు ఏళ్లతరబడి తలఎత్తకుండా చేసినా తెగనిచిక్కు లెక్కలను ఈయంత్రాలు చిటికెల మీద చేసెయ్యగలవు. ఒకభాషలో ఉన్న పుస్తకాన్ని మరోభాషలోకి అనువాదం చెయ్యగలవు. ఎన్నెన్నో విషయాలు జ్ఞాపకం పెట్టుకోగలవు. చదరంగం ఆడి తంగిరాల సంకరప్పను కూడా ఓడించెయ్యగలవు. ఆటలో ఈఎత్తువేస్తే మంచిదా, ఆఎత్తువేస్తే మంచిదా అని ఆలోచించి, తర్కించి, ఒకనిర్ణయానికి రాగలవు. ఆజ్ఞలు జారీ చెయ్యగలవు. మనిషిలేకుండా విమానాలను నడుపగలవు........."

"అమ్మ బాబోయ్!"

"వాటికి ప్రాణంలేదు. అయితే,మరి ప్రాణంఉన్నవాటికీలేనివాటికీ భేదంఏమిటో?"

తమకు తెలియదని ఒప్పుకున్నారు పిల్లలు. ఆచిఆచి మాట్లాడేడు సూర్యం.

"ఇదిచాలా జటిలమైన సమస్య. పిల్లికి ప్రాణం ఉన్నదనీ, రాతిలో ప్రాణం లేదనీ సులభంగా చెప్పగలుగుతున్నాం. కాని కొన్ని జీవాలను పరిశీలించిచూస్తే అసలు అవి జీవాలేనా అన్న అనుమానం కలుగుతుంది. ఆరకం జీవాలను గురించి మరోమాట చెప్తాను. జీవులన్నింటికీ సర్వసాధారణమైన ధర్మాలు కొన్నిఉన్నాయి. వాటిలో అతిముఖ్యమైనవి— పెరుగుదల, సంతానోత్పత్తి. ఈరెండుముఖ్యధర్మాలూ ఉన్నవి ప్రాణులనీ, లేనివి అప్రాణులనీ నిర్వచించవచ్చు. మోటారుకారు తనలాంటిదే మరోకారును తయారు చేయలేదు. టెలిఫోను మొదలు చేసిన దానికన్నా పెద్దదైపోదు. .........పాతకాలపు అపరాధ పరిశోధక నవలలలో కథాంతంలో "హంతకుని ప్రాణవాయువులు అనంతవాయువులలో కలిసిపోయినవి" అని ఉండటం మామూలు. సన్యాసులకు కపాలం పగిలి అందులో నుంచి ప్రాణాలు పోతాయని ఒకనమ్మకం. భరించాలక మరణించే సన్యాసికి

55 వ పేజీ చూడండి

# తెలుగు చిత్రాల్లో ప్రమాణాలు పతనం: అక్కినేని!

“గత 5 ఏండ్లుగా విడుదలవుతున్న తెలుగు చిత్రాల స్థాయి తగ్గిపోతున్నది. ఉత్తమ కథలు తక్కువ గావటం, ప్రేక్షకాభిరుచులు మారటం వగైరా కారణాలు కావచ్చుని “నటసామ్రాట్ శ్రీ అక్కినేని నాగేశ్వరరావు మే నెల 13 వ తేదీ బందరులో చెప్పారు.

మంచి కథలు యిస్తే తానే చిత్రనిర్మాణానికి పూనుకోగలనని అన్నారు.

వరుసగా 23 ఏండ్లు చిత్రసీమలో ముఖ్య పాత్రలు ధరిస్తూ నేటికీ పెండ్లికుమారుని పాత్ర ధరించటమంటే కొంత విరక్తి కలుగుతున్నదని చెప్పారు. దక్షిణ భారత దేశంలో ఇన్ని ఏండ్లు ప్రధాన పాత్ర ధరించుతూ ఉన్నది తానొక్కడనే అన్నారు వారు. యింకా వారి అభిప్రాయాలు యిలా ఉన్నాయి.

“హైదరాబాద్‌లో ఫిలిం పరిశ్రమ అచిరకాలంలోనే అభివృద్ధి అయి అఖిల భారత దేశంలో 5 వ స్థానాన్ని పొందుతుందనేందుకు సందేహంలేదు”

ఇంతకాలం ఫిలిం పరిశ్రమలో ఉన్న మీ ఆరోగ్యం బాగా ఉండటానికి కారణమేమనగా “నేను ఆరోగ్యం కాపాడుకోవటంలో కొన్ని పిచ్చి అలవాట్లు నాకు ఉన్నాయి. అందుచేతనే 1942 నుండి తలనొప్పి, జ్వరం అంటే ఎలా ఉంటుందో నాకు తెలియదు. అయితే మా శ్రీమతిని తలనొప్పి అంటే ఎలా ఉంటుందని నేనే అడుగుతుంటాను.”

“1952లో సిలోను వెళ్లినప్పుడు నా అభిప్రాయాలను అక్కడివారికి చెప్పాలంటే తెలుగుభాష వారికి తెలియదు. తమిళం నాకు బాగా రాదు. అందుచేత మనది కాని ఆంగ్లభాషలోనే అక్కడ మాట్లాడాను. ఈ సంఘటనతో విద్య లేకపోవుటచేత ఎంత అపహాస్యం కాగలనో నాకు అర్థమయింది. అప్పటినుండి దీక్షతో ఆంగ్లభాష నభ్యసించటం జరిగింది. సామాన్య పౌరునిగా ఆకలిబాధ, ధనికుడిగా అజీర్తి బాధ రెండూ



నాకు బాగా తెలుసు.

ఈ విద్యా విషయంలో అప్పటి ఆంధ్రా యూనివర్సిటీ ఉపాధ్యక్షులు శ్రీ వి. ఎస్. కృష్ణను కలుసుకుని నా అభిప్రాయాలను, అనుభవాలను వివరించాను. దానిపై వారు రు. 18,500లు స్కాలరుషిప్పు యివ్వవచ్చుని, రు. 25 వేలు యిచ్చి సెనేటు సభ్యుడుగా కూడా ఉండవచ్చుని సలహా యిచ్చారు. అందుకు నే నంగీకరించి వారి అభినందనలు స్వీకరించాను.

## దానాలు

“దానాల్లో గుప్త దానం చేసేదే సరైనదని నేను అభిప్రాయ పడుతాను. ఫిలిం ప్రపంచంలో 23 సంవత్సరాల్లో నేను సంపాదించిన (బహిరంగంగాను, పరోక్షంగాను) దానిలో మూడవ వంతు దానాలు యిచ్చాను. యూనివర్సిటీ కిచ్చినది స్వల్ప మొత్తం అయితే నాపై అభిమానంతో పత్రికలు విపరీతమైన ప్రచారం చేయుటం జరిగింది. ఇప్పుడు నేను ఎక్కడకు వెళ్లినా పాఠశాల కావాలనో, యింకేదో కావాలనో వినతిపత్రాలు యిస్తున్నారు—అందరూ కోరిన పట్లు చేయుటం సాధ్యపడేదికాదు—అయినా విద్యకు తోడ్పడటం, సహాయపడటం నా ధర్మంగా గుర్తుంచుకున్నాను.

“1953నుండి1965కు ఐదుగురుపిల్లల తండ్రి నయ్యాను. నా పిల్లలు బాగా చదవాలని ఉన్నది. మద్రాసులో తెలుగు బోధన స్థాయి గల పాఠశాలల్లో లేదు. పిల్లల తెలుగు బోధన విషయం యోచిస్తున్న తరుణంలో శ్రీ రామకృష్ణప్రసాద్ మద్రాస్‌లోని తమ స్టూడియో మూసివేసి హైదరాబాదు వెళ్లాలనే ప్రయత్నంలో ఉన్నారు. అయితే స్టూడియో మూసివేసేందుకు కొందరికి యిష్టం లేనందున మరో ప్రసాద్‌గారు దానిని నిర్వహించేందుకు తీసుకోవటం జరిగింది 1963 లో.

“హైదరాబాద్‌లో చిత్రనిర్మాణం కొంత ఖర్చు (కళాకారులను మద్రాసునుండి పిలిపించుకోవటం వగైరా) తో కూడినదైనందున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 50వేల రూపాయలు రిబేటుగా చిత్రానికి యిచ్చేందుకు ప్రకటించింది.

“23 ఏండ్లుగా వేషాలతో విసిగిపోయిన నేను 1964 నుండి 1975 వరకు ఏడాదికి నాలుగు చిత్రాలకు మించి నటించరాదని నిర్ణయించుకున్నాను. కారణం 1962 లో పరిశ్రమలు స్థాపించుకుని, 1964 లో వ్యాపారరంగంలో ప్రవేశించాలని, నా పిల్లలను తెలుగులో చదివించుకోవాలని. అయితే నన్ను నమ్ముకున్న కొందరు నిర్మాతలు ఫిలిం పరిశ్రమ గురించి నన్ను ప్రోత్సహించారు. శ్రీ సంజీవరెడ్డి హైదరాబాదులో స్థాపనకు ప్రోత్సాహం యిచ్చారు. హైదరాబాదులో చిత్రనిర్మాణానికి కావలసిన హంగులన్ని ప్రకృతి ప్రసాదించినవి. సహజమైనవి కూడా. యిక్కడ ఫిలిం పరిశ్రమ ఏర్పడినట్లయితే తెలుగువారి వెలుగు, శక్తి సామర్థ్యాలు వెల్లడించే అవకాశాలుంటాయి. అందుచేత యీ రంగంలో నాకున్న 23 సం. అనుభవంతో ఒక ప్రణాళిక తయారుచేసి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అందజేశాను.

"ఫిలిం పరిశ్రమద్వారా యూనియన్ గవర్నమెంటుకు 19 కోట్లు, ఇంకా ఇతరత్రా కలిసి మొత్తం 40 కోట్లు ఆదాయము వస్తుంది. ఆంధ్రరాష్ట్రానికి చిత్రానికి 10 లక్షల రూ. వంతున ఏడాదికి 35 చిత్రాలకు 3½ కోట్లు ఖర్చు కావటం జరుగుతున్నదని, ఆదాయం విషయంలో పదిమంది పెద్దతారలుంటే 60 లక్షల రూపాయలు. అలాగే యితర ఆదాయాలు, వినోదంపన్ను వగైరా అన్నీ నా ప్రణాళికలో వివరించాను.

"మన రాష్ట్రప్రభుత్వం దీనిని గుర్తించి, చిత్రనిర్మాణానికి రు. 50 వేలు రిబేటు యిచ్చి ప్రోత్సహించుతున్నది. రు. 75 వేలతో ఆరు మాసాలలో చిత్రనిర్మాణం లాభకరం, రిబేటు యివ్వటం, పరిశ్రమను ప్రోత్సహించటమే గాని వేరేమీ కాదు.

"మద్రాసునుంచి రానివారికి ఆంధ్రాభిమానం లేదనుకోవటం పొరపాటు. అందుకు వారిని విమర్శించటం కూడా మంచిదికాదు. ఉన్న వూరు, యిల్లు వదిలి రావటంలో అనేక కారణాలుంటాయి. నేను మద్రాసు నుండి వస్తుంటే కొంత బాధపడ్డాను, ఇక నా శ్రీమతి బాధను మరిపించేందుకు ఎంతో శ్రమపడాల్సి వచ్చింది. అదేవిధంగా మద్రాస్ నుండి రానంతమాత్రంలో వారికి ఆంధ్రాభిమానం లేదనుకోరాదు.

"మనం మంచి మనస్సుతోఉంటే అదృష్టము కూడా మనతోనే ఉంటుందనేది నా నమ్మకం.

"మానవసేవ మాధవసేవ అని నా అభిప్రాయం.

"నేను నాస్తికుణ్ణికాదు, అయితే పూర్తిగా ఆస్తికుణ్ణి కూడా కాదు, అంత మాత్రాన డి. ఎం. కె. గాని, కమ్యూనిస్టులకు గాని చెందినవాణ్ణి కాదు. నిపక్కైన కాంగ్రెసువాదిని, యింకా చెప్పాలంటే హ్యూమనిస్టుని.

"హైదరాబాదులో తెలుగు పరిశ్రమకు మంచి భవిష్యత్తు ఉన్నది. అచిరకాలంలోనే భారతదేశంలో యిది ఐదవ స్థానం పొందుతుందనేది నా దృఢ విశ్వాసం."



'భక్త పోతన'లో పద్మిని

# సినిమా

50 వేలు రూ. రాష్ట్రప్రభుత్వం యివ్వటం గురించి మళ్లీ వివరిస్తూ నిర్మాణానికి 75 వేలు ఖర్చు చేస్తున్నప్పుడు సెట్సుకు రు. 30 వేలు, దానిపై అమ్మకం పన్ను, ఫిలింపై అమ్మకంపన్ను, ఆదాయపుపన్నులో రాష్ట్రం వాటా కలిసితే రాష్ట్రప్రభుత్వానికి రు. 50 వేలకు మించే ఆదాయం ఉంటుందని, అందుచేతనే వారు 50 వేలు రిబేటుయిస్తామని ప్రకటించారని చెప్పారు.

ఆయన త్వరలో స్థాపించబోవు టెక్స్టైయిల్ పరిశ్రమలో 360 మంది పనివారుంటారు. అమెరికా మిత్రులు ఆటోమేటిక్ యంత్రాలను ఆ పరిశ్రమలో ఏర్పాటుకు సలహా యిచ్చారు. అయితే అది వారికియిష్టంలేదు. ఈ యంత్రాలుంటే 360 మందిలో 15 మందికి మాత్రమే పని ఉంటుంది. మన దేశంలో 70 శాతం శ్రామిక ప్రజానీకం ఉన్నారు — ఇది గుర్తించి శ్రామిక వర్గానికే పని కల్పించదల్చారు.



'చిలకా—గోరింక'లో కృష్ణకుమారి

"సినిమాలకుముందు నాటకాల్లో స్త్రీ పాత్రలు ధరించేవాడిని. మేము అయిదుగురు అన్నదమ్ములం, నేను ఆఖరువాణ్ణి కావటం, మా అమ్మకు ఆడపిల్లలు లేనందున నన్ను స్త్రీ పాత్రలు ధరించేందుకు ప్రోత్సహించి, ఆ వేషంలోని ఫొటోలతో మా అమ్మ ఎంతో ఆనందించేది. సినిమా రంగంలో ప్రవేశించటానికి కూడా మా తల్లి ప్రోత్సాహం ఎంతో ఉన్నది

"ఈనాటికైనా నేను స్త్రీ పాత్ర ధరిస్తే, ఆడవాళ్ల కంటె బాగా నటించగలనన్న ధీమా నా కున్నది.

"నేను షూటింగులకు వెళ్లేటప్పుడు నాకు కావలసినవన్నీ, ఆఖరుకు మజ్జిగ, మంచినీటితో సహా నేనే తీసుకువెళ్తాను, ఈవిధంగా ఇంకా మరికొందరు కూడా తెచ్చుకోవటం జరుగుతున్నది. అంటే నిర్మాతలు సరఫరా చేయరని కాదు, ఆవిధంగా అలవాటయ్యాం.

"ప్రజలు ఆపదల్లో ఉన్నా, దేశానికి విపత్తు సంభవించినా, మేము ఎప్పుడూ బాధ్యత విడిచిపెట్టలేదు— ఇకముందు కూడా మా శక్త్యనుసారం కళాకారులం రంగంలోకి ముందుకు వచ్చి పనిచేయగలం—యిదే మా అభిమానం కూడా"

[మేనెల 13 వ తేది శ్రీ అక్కినేని నాగేశ్వరరావు బందరులో వివిధ సభల్లో చేసిన ప్రసంగాలలోని భాగాలన్నిచేర్చి వ్యాసం రూపంగా శ్రీ పి. రామలింగయ్యగారు పంపారు అది ప్రకటిస్తున్నాము ●]

